శ్రీః

# శారదానందలహరి

అవధాన సరస్వతి

## పేరాల భరతశర్మ


శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము
ప్లాటు నెం. 167, సెక్టరు-4,
ముర్వలవానిపాలెం కోలని,
విశాఖపట్నం - 530 017
ఫోను: 0891-2543170, 9849069795



కాదంబరీ ప్రచురణ

శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము
26/8 ఎం.వి.పి. కాలనీ
విశాఖపట్టణము - 530 017









## श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम् ,
## दक्षिणाम्नाय श्री शारदापिठ म, श्रृंगेरी

**PRIVATE SECRETARY**
To his holiness Sri Jagadguru
Shankaracharya, Dadshinamnaya
Sri Sharada Peetham
Sringeri - 577 139 (Karnataka)

Ref. No : 11/16450
Camp : శృంగేరి
Date : 13-11-97

శ్రీయుతులు పేరాల భరత శర్మగారికి నమస్కారములు

తమరు ''శారదానందలహరి'' యను భవత్కృత గ్రంథమును శ్రీ జగద్గురు చరణుల సన్నిధిన స్వయముగ చదివి వినిపించి శ్రీ చరణులను ఆనందింప జేసినారు.

సకల విద్యాధి దేవతయగు కమలజదయితను శ్రీ మచ్ఛంకర భగవత్పాదులవారు శృంగేరీ క్షేత్రమున ప్రతిష్ఠించి బహువిధములుగ నుతించినారు. నాటినుండి ఎందరో మహానుభావులు ఆ జగన్మాతను స్తుతించి తమ కవితను సార్థక మొనర్చుకొనినారు. భక్తుల పాలిటి పెన్నిధియగు శారదా పరమేశ్వరిని స్తుతించుట మహా భాగ్యము కదా.

తమరు ఈ గ్రంథమునందు అత్యంత భక్తితో ఆ పరమేశ్వరిని స్తుతించినారు. తమ రచన భావపూర్ణముగ నున్నది. పద్యములందు మాధుర్యము తొణికిసలాడుచున్నది. దానిని పఠించు వారలకు ఆ దేవి యందు భక్తిని ఇనుమడింప జేయునదిగ నున్నది.

ఈ గ్రంథము భక్తజనుల కరపల్లవాలంకార మగు గాక యనియు తమ కితోధిక శ్రేయః పరం పరలు సమకూరుగాక యనియు శ్రీ చరణులు నారాయణ స్మరణ పూర్వకముగా నాశీర్వదించినారు.

ఇంతే నమస్కారములు

**(సం) గౌరీశంకర్**





## గురుదేవులు

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి
ఆశీస్సు.

మా భరతశర్మకాయుః
శ్రీ భాగ్యములిచ్చుగాక శేషాహి శిరః
శోభారత్నచ్ఛవి మ
ల్లోభాపఘనుండు లక్ష్మిలోలుడు కరుణన్

5-3-1970 గుంటూరులో
సంస్కృతి కేంద్ర అవధాన వేదికపై

శూరాధ్వాను గునిన్ నిరంతరిత శుశ్రూషా సమాత్తోజ్జ్వల
ద్ధీరోచిష్ణుని సాధుశీలరచనా తృప్తున్ ప్రియోహా క్రియున్
పేరాలాన్వయ బాలచంద్రముని మత్ప్రేయః పథీనున్ పురా
ప్రారూఢ ప్రతిభామతిన్ భరతశర్మన్ నేను దీవించెదన్

డిసెంబరు 1968
విజయవాడ శ్రీ రాజా రంగయప్పారావు
ప్రభుత్వ కళాశాల అవధాన వేదికపై

---

తన జిహ్వాగ్రమునన్ సరస్వతి సముత్సాహంబునన్ నూత్న నూ
తన భావ ప్రచయాభిరామ పద సంధానంబునన్ మేఖలా
మణి ఘంటల్ మొఱయింప సత్కవన సామ్రాజ్యాధి నేతృత్వమున్
గొను మద్దేశిక సార్వభౌము వినుతింతున్ విశ్వనాథాన్వయున్

పేరాల భరతశర్మ

**SARADANANDA LAHARI**

*Devotional Poetry*

**By PERALA BHARATA SARMA**

First Edition - October 1998

1000 Copies.



**Price - Rs. 50/-**

**PUBLISHERS :**
**Kadambari**
26/8 M.V.P. Colony
Visakhapatnam - 530 017

**COVER DESIGN**
**Bapu**

**FOR COPIES**
(1) **P. Bharata Sarma**
26/8 M.V.P. Colony
Visakhapatnam - 530 017

(2) **Kadambari Publishers.**



**శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ మహాస్వామినః శారదా పీఠమ్, చినముషిడివాడ, పెందుర్తి మండలమ్, విశాఖనగరము.**

## మంగళకామనా :

కవిలోక సుఖ్యాత కీర్తయః, విశ్రాన్త సంస్కృత కళాశాల ప్రధానాచార్యాః, 'అవధాన సరస్వతీ'తి బిరుదేన సమలంకృతయశోభూషణాః శ్రీమన్తః ''పేరాల'' వంశజాః భరత శర్మాణః సుప్రతిష్ఠిత ప్రతిభా ప్రభావశాలినః! తేషాం నైకే గ్రంథాః, కావ్యాని చ పఠితౄణాం మనాంసి కవితా పీయూష పూర్ణాని కుర్వన్తి!

అధునా తైః పునరన్యా కృతికన్యా ధన్యా, విద్వజ్జన మాన్యా విసృష్టా! ''శారదానందలహరీ''తి నామ్నా విరాజమానా శతపద్య కవితేయం యతీంద్ర మణిద్వీపే శృంగగిరిక్షేత్రే స్థిర వాసం కుర్వత్యాః భారత్యాః శారదాంబాయాః మహిమా స్తుతిగీతిః! ప్రత్యక్షరమధురా, భక్తి భావ పారవశ్య సుధా మందాకినీ, అకృతకాలంకార - శోభినీయం ''శారదానందలహరీ'' శ్రీమతాం శర్మణాం వాగ్వైభవస్య విశుద్ధపాండిత్య శ్రియశ్చ ఆకరీభూతా ఇతివక్తుం నాస్తి సందేహ లేశోఽపి!

అనయా కవితయా కవేరస్య అమలాకీర్తిః ఆ చంద్ర తారకం విరాజతామితి భగవత్యాః శారదాంబాయాః అనుగ్రహోఽపి పుష్కలమస్తు అస్మై ఇతి అస్మాకం మంగళకామనాః !!

30-08-98
**శారదాపీఠమ్, విశాఖనగరమ్**

**నారాయణ స్మృతయః !**
**స్వామి స్వరూపానందేంద్ర సరస్వతీ**

'ప్రవచన శిరోమణి'

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు

## అవగాహనము

శంకరభగవత్పాదులు అమ్మను స్తోత్రం చేసి దానికి సౌందర్యలహరి అని పేరు పెట్టారు. పరమశివుని స్తుతించి ''శివానందలహరి'' అని పేరుంచారు. సౌందర్యలహరిలో మంత్రశాస్త్ర రహస్యాలతో శ్రీ విద్యోపాసనాన్ని, శ్రీచక్ర నిర్మాణాన్ని వివరించారు. ఈ విధంగా ఆగమ రహస్యాలతో, మంత్ర శాస్త్ర ప్రక్రియలో సాగింది సౌందర్యలహరి. పరమశివ స్తుతిగా భక్తి భరితముగా శివానందలహరిని రచించారు. అలాగే అవధాన సరస్వతి శ్రీ పేరాల భరతశర్మగారు శ్రీమాతృచరణారవింద వరివస్యావరిపాకంగా ఫలించినది భక్తి భావబంధురంగా, భావనావరిపూర్ణంగా, మంత్ర శాస్త్ర రహస్యగర్భంగా ఈ శారదానందలహరి. సహజకవి. అవధానంలో సిద్ధహస్తులు అవడంచేత కవిత్వానికి అవసరమైన అవధానం అనగా సమాధి వారి సొత్తు. భావయిత్రి, కారయిత్రి శక్తులు రెండూ కలవారు, కవి, పండితులు, విమర్శకులు, ఉపాసకులు అవడంచేత నిండైన సగుణము, నిర్దోషము అగు కావ్యము ఆవిర్భవించింది. ధన్యులు, వీరి జన్మ, విద్యా వంశములు రెండూ గొప్పవి. ''కవి భూషణుండైన కన్నయ్య బాలకృష్ణయ్య – ''రాగరసభావరమణీయ రాజ్యలక్ష్మి'' జననీ జనకులై జన్మనొసంగినారు. ''ఘన కవిసమ్రాట్టు కల్ప వృక్షచ్ఛాయ గురువద్య విద్య'' ను కూర్చుకున్నారు. చిఱుత ప్రాయపు నాడే శ్రీ వేంకటేశ్వర పాద పంకజ రక్తిచే కైతలల్లుట ఆరంభించినారు. శ్రీరామపాదాభిషేక క్రియాసక్తిని భాసనాటకము ''అభిషేకము'' ఆంధ్రీకరించినారు. శారదా కటాక్షపాత్రులై పట్టైన సభలందు అవధానము లలవోకగా సవదరించినారు. ''మధురావిజయ'' కథాకథనముచే అఖిలాంధ్ర విఖ్యాతినందినారు. ''కాదంబరీ రసజ్ఞత'' అను విమర్శ గ్రంథములో త్రిపురా రహస్యాలను ప్రకాశింపచేసినారు. చివరకు శృంగగిరి భారతీ తీర్థ





సేవనముచే 'శారదానందలహరి' వారికి సాక్షాత్కరించినది. జీవితము సఫల మొనర్చుకొనినారు.

శారద వాగ్దేవి. ఆమె శృంగగిరి భారతీతీర్థులవారి ఉపాస్య దైవం. భారతీతీర్థుల కటాక్ష ప్రసారంచే వీరికి వారి అనుగ్రహం కలిగింది. శారద వీరి హృదయ వీణియను మీటి వేదనాద స్పందనను వెల్వరించినది. శాంకరిని శ్రీ సంప్రదాయమువారు సృష్టి స్థితి లయకారిణిగా భావింతురు. సహజముగానామె సత్త్వ మహిత. కాని రజోగుణము సృష్టికి, తమోగుణము సంహారమునకు ఆవశ్యకములు. అందుకై ఆమె చమత్కారముగా తనయందు లేని రజస్తమస్సులను ఆరోపించుకొన్నదన్నట్లు చంద్రకళాధరుడు చమత్కరించినాడట. ''ఫాలమునందు ప్రాంతముల'' శశాంక లేఖవయి ముంగురులు వ్రాలినవట. తనకెంగేలితో ఆ ముంగురులను ఆమె తొలగించుకొన్నదట. కేవల సాత్త్వికమూర్తియగు నామె రజోగుణముతో నొప్పి తమస్సున మునిగినది అనినారు శ్రీ శర్మగారు. శుద్ధమైన సత్వగుణము శశాంక లేఖవంటి ఫాలమున దర్శనమిచ్చినది. కెంగేలు రజోగుణముగా, ముంగురులు తమోగుణముగా తోచినది. సృష్టి, స్థితి, లయకారిణిగా అమ్మకు సహజముగ లేని రజస్తమస్సులను ఆరోపితముగ సంతరించుకొనుట అమ్మకు అవసరముకదా. ఎంతటి మధురోహయెా చూడుడు. ''మత్తమత్తద్విపయాన సుందర పదా''... అను పద్యములో వృత్త్యనుప్రాసము చిత్రముగా నిబంధింపబడినది. ఒక్కొక్కప్పుడు వీరి చేతము ద్వైధీభావము చేత ఇట్టట్టు లూగుచుండగా శారద స్వాధిష్ఠానమున అద్వైతామృతా నందలక్ష్మీధీనైచికియై వీరి బోధను క్షాళనము జేయుచుండును. పొరుగింటి కవిత్వం విని పొంగిపోయేవారిని చూచి ఇంటివారికి అసూయ కలగడం సహజమేకదా. అట్లే వీరి శారద నయనములు పొరుగింటి కర్ణముల చెంత సత్కవీశాన వాఙ్మయ గాథా శ్రవణంచేసి స్ఫారమ్ములు కాగా అమ్మ ఫాలము ఎఱ్ఱబడి నయనాంచలములు నల్లబడినవట. భావములోని సౌందర్యమును,

భావనలోని వైశిష్ట్యమును చూడుడు. ''సంధ్యావేళల నాకసమ్ము...'' అను పద్యములో సాయంసంధ్యా సమయంలో సావిత్రిగాయత్రియై ముక్తా ప్రవాళహేమనీలధవళ దీప్తులతో విరాజిల్లినదట. ఆకాశము, భూమి, సంద్రము, రోదోంతరము, గాయత్రీ స్వరూపములై సంధ్యారూపమున దర్శనమిచ్చినవి. ఈ ఐదు వర్ణములు వహించిన ఐదు ముఖములు పరదేవత యొక్క సృష్టి స్థితి, లయ, అంతః ప్రవిశ్యనియమన, ముక్తి ప్రదత్వములను సూచించుచున్నవి. వీరికి రాత్రివేళ అమ్మ ఆమెకు నచ్చిన కొన్ని పద్యములను ఈయనకు తెలివివచ్చి వినునట్లు చెవిలో పలుకుచున్నదట. ఎన్నో మంత్రరహస్యాలను ఇందు జొనిపినారు. వీరిని ఒక్కొక్క పద్యము ఊహలతో శ్రీ శారద వైపు తరుముచున్నది. ఆమె కన్పడకుండనే వీరు ఏదో దివ్యశక్తి విన్పింపగా పలికినారు. ఈ కావ్యమున వీరు అద్వైత సిద్ధాంతమును ఆదరించివారు. అది ప్రాచీనార్షవచః ప్రమాణితమని సద్వ్యాఖ్యాన విఖ్యాతమని ఎరింగి చాంచల్యము బాసి అనుభవించినారు. దక్షిణామ్నాయ పీఠ పరివ్రాజక హంసములను వీరు కొల్చినవారు. ఆ హంసము సర్వదాభినవ విద్యాతీర్థ సంజాతము. శ్రీచక్ర నిర్మాణములో ఆగమ శాస్త్ర రహస్యములను వీరు ఎరింగినవారు. భూపురత్రయమును, త్రివృత్తమును, షోడశమును, అష్టదళమును, దశారయుగ్మమును చేరి శ్రమించుచు అష్టకోణమును చెంది త్రికోణ బిందువును చేరి లయించిన భాగ్యశాలి. ఇట్టి భావనాపూర్ణులు, విశదవాగ్వైఖరీపూర్ణులు, శారదా పరిపూర్ణ కటాక్షపాత్రులు నగు శ్రీ శర్మగారు ధన్యులు.

శ్రీ శారద వారికి ఉత్తరోత్తరము తన పదలాస్యముచే లాలిత్యమును కల్గించి జగత్ప్రసిద్ధములగు కావ్యములను వెలయించునట్లు అనుగ్రహించుగాక.

ఇట్లు

శ్రీభాష్యం అప్పలాచార్యులు





**డా. ఈశ్వరసీతారామ ధన్వంతరి**

శ్రీ మాత్రే నమః

## వాఙ్ముఖము

శ్రీ శంకర భగవత్పాదులు ''సౌందర్యలహరి'' అను శిఖరిణీ వృత్త బద్ధమైన గ్రంథమును రచించిరి. దానిలో పరదేవతాస్తవము అను మిషతో స్థూల సూక్ష్మ పరోపాసకులకు అందరకు దేవీ తత్త్వమును వివరించి, మహోపకారము చేసిరి. ఇది శ్రీ విద్యారహస్య మణి పేటిక. ఇందు విద్యామహిములు, మంత్రశాస్త్ర రహస్యములు, శ్రీ చక్ర వివరణము, షట్చక్రసంబంధము, షట్ చక్ర వేధ, కుండలినీ ప్రసార రహస్యములే కాక, గుప్తముగా షట్‌దర్శన విచారము సమన్వయ రూపమున చేసి అద్వయ బ్రహ్మాత్మైక్య ప్రాప్తికి అనువగు మార్గమును సవిమర్శముగా చూపిరి. ఇది కవితా రస రసాలయము. ఇది శ్రీ శంకరులను మహాకవిగా నిరూపించు కృతి. శ్రుత్యాగమ పరిచయము గల శ్రీ విద్యా సాధకులకు ఈ గ్రంథ ప్రామాణ్యము మరింత విశదము కాగలదు. అది గాక సగుణోపాసకుల మనస్సున పరదేవతా సాక్షాత్కారము చేయింపగల మణి ముకురము. పంచదశీ, షోడశీ, మంత్ర రహస్యములు ఇందు సాభిప్రాయముగనే శంకరులు నిబద్ధించిరి. మానవుడు పరదేవతాంశ. బయట నున్న బ్రహ్మాండమంతయు సూక్ష్మ రూపమున ఇతని యందున్నది. ఆ పరదేవత యొక్క అమేయ శక్తులన్నియు ఇతని యందు నిద్రాణముగా ఉన్నవి. సులభ మార్గమున, ఈ నిద్దురపోగొట్టుకొని, తన సహజ దివ్యత్వమును, అనంతశక్తి మత్త్వమును అనుభవమునకు తెచ్చుకొనుట ఎట్లో విశదీకరించునది తంత్ర శాస్త్రము. మంత్రము దానికి ఉపాయము. యంత్రము పరతత్త్వమునకు జ్ఞాపిక యగు స్థూల ప్రతీక. సాధనతో పరతత్త్వమును అనుభవమునకు తెచ్చుకొనుటయే మన విధి. మార్గము లేవైనను వాటి పరమాశయము ఇదే. దీనినే ఉపాసన అని అందురు. ఇది శాస్త్రీయమైన మాట. ఉపనిషత్తు అనిన ఉపాసన రహస్యమును తెలుపునది అని అర్థము. ''ధర్మేరహస్యుపనిషత్'' అని కదా కోశము.

ఇక ప్రస్తుత గ్రంథమునకు వత్తము. ఈ గ్రంథము పేరు ''శారదానందలహరి''. రచయిత శ్రీ పేరాల భరతశర్మగారు. వీరిని లోకము ఒక మహాకవిగా, పండితునిగా, అవధాన శిరోమణిగా, మాత్రమే ఎఱుగును. నాకును ఈ గ్రంథమును పరిశీలించు వఱకు వీరిని గూర్చి ఇట్టి యభిప్రాయమే. వీరు చిరవైరాగ్యాభ్యాస సంపన్నులగు శ్రీ విద్యామూర్తులుగా ఈ గ్రంథాను శీలనమున ప్రతి పద్యము సాక్ష్యముగ నిలిచినది. భక్తి జ్ఞాన వైరాగ్య భావ బంధురములగు వీరి పద్యములు వీరి ఉపాసనా తీవ్రతనే గాక సాధకోత్తమునిగా నిరూపించును. యోగ సిద్ధి లక్షణములు వైయక్తికముగ (సబ్జెక్టివ్‌గా) అనుభవమునకు మాత్రము ఎఱుక పడును. యోగ సిద్ధుని ఆంతరస్థితి ఊహకవ్వలది. ఐనను లౌకిక జీవిత విధానములో అది కలిగించు విలక్షణత (Change and transformation of personality) సన్నిహితులకు పొడసూపక మానదు. అందువల్లనే అర్జునుడు గీతలో శ్రీ కృష్ణుని ఇట్లు ప్రశ్నించెను. ''స్థిత ప్రజ్ఞస్యకాభాషా? సమాధిస్తస్య కేశవ! స్థిత ధీః కిం ప్రభాషేత, కిమాసీత వ్రజేతకిమ్ అని. దీని వివృతియే యోగ సిద్ధలక్షణములుగ శ్రీ కృష్ణుడు తన సమాధానములో వివరించెను. విద్య యేదైనను దాని తత్వము సమగ్రముగా అవగత మైనచో వినియోగ రూపమున ఫల మందించును. లేనిచో శుష్కవేద పాఠప్రాయమై చెల్లుబడి లేకుండును.

శ్రీ శర్మగారు రచించిన ''శారదానందలహరి'' మాదృశులకు సౌందర్య లహరిని స్మరణకు తెచ్చును. విషయములో వివరణలో, అనుభూతిలో, కవితలో ఇది యది యననేల సర్వాంగీణముగా నిది సౌందర్యలహరికి దీటుగా నున్నది యనుటలో సత్యము తప్ప పక్షపాతము లేదని విద్యా తత్త్వ మెరిగిన ఎవరును ఒప్పక తప్పదు. ఇందు జ్ఞాన కర్మభక్తిమార్గ ప్రదీపకములు, అనుభూతి సార్థకములు నగు పద్యములు శ్రీ మొదలు శివాంతముగా గ్రంథమును అలరించినవి.

శ్రీ శర్మగారు తత్త్వజ్ఞులగుటయే గాక, కుండలినీ యోగ రహస్యములు సాధనరహస్యములు కూలంకషముగ నెరిగిన వారు. దేవీ తత్త్వము ఉపాసనాపద్ధతి ఒక శాస్త్రీయమైన విధానముగ ప్రసిద్ధిపొందినది. వీరు





సమగ్రముగ సాధన చేసి అనుభూతికి తెచ్చుకొన్న ధన్యులు. లేనిచో శాస్త్ర రహస్య బంధురముగ ఈ 'శారదానందలహరి' ఉండెడిది కాదు. నేనెఱుగను గాని వారు పాదుకాంత దీక్షితులైయుండవలె. దానికి అంతస్సాక్ష్యముగ వీరి ప్రతి పద్యము ఔనసును. ఇది వీరి అధికారము కొఱకు అన్నమాటకాదు. శ్రీవిద్యాదీక్షితులు కాకుండ ఇట్టి అమోఘరచనము వారి లేఖినీ గళితమైనను అది కేవల పరదేవతానుగ్రహమనియే నా విశ్వాసము. మంత్రగ్రహణ విషయము, అనుభూతులు పెఱ వారికి తెలుప కూడదను శాస్త్ర నిషేధమున్నది. అలం తావత్. ఈవిషయమును నొక్కి వారిని నేనడుగలేదు.

శ్రీ శర్మగారు రచించిన యీ గ్రంథములో కొన్ని పద్యములు ఆత్మాను భూతులు, కొన్ని భక్తి పీయుషచషకములు. కొన్ని తత్త్వ ప్రతిపాదకములు. వారు ఉర్వీ సరస్వతులగుట ప్రతి పద్యము పాండిత్యమండితముగను, కవితా మధు స్యందిగను దీపించుచున్నది. ఇది కూడ ఉపాసనకు ఆనుషంగిక ఫలముగ లభించును. ఈ సత్యమును శ్రీ శంకరులు గూడ సౌందర్యలహరిలో ఈ క్రింది శ్లోకములో ప్రతి పాదించిరి. ఈ విద్య సారస్వత ఫలముగూడ నీ జాలునని యీ శ్లోకము వివరింపగలదు.

శ్లో. కవీంద్రాణాం చేతః కమల వన బాలాతపరుచిం
భజంతే యే సంతః కతిచి దరుణామేవ భవతీం
విరించి ప్రేయ స్యాస్తరుణ తర శృంగార లహరీ
గభీరాభిర్వాగ్భి ర్దధతి సతాం రంజనమ మీ!

శ్రీ శంకరాచార్యుల వారికి 'శ్రీ విద్యాదీక్ష' వారి పరమ గురువులగు, శ్రీ గౌడపాదాచార్యుల వారి వలన అనుగ్రహింపబడినది. శ్రీ గౌడపాదులు రచించిన ''సుభగోదయము'' అను గ్రంథము ఈ మాటను పోషించును. సుభగోదయచ్ఛాయపైనే– సౌందర్య లహరి తొలి నలువదియొక్క శ్లోకములను రచించిరి.

శ్రీ విద్యయొక్క పవిత్ర చారిత్రక ప్రమాణము నిరూపించుటకే యీ

మాట. ఇందు శక్త్యుపాసనమే పరమ తాత్పర్యము. ఇది వేదోపనిషత్తులకు సమ్మతమగు విద్య. దీనిని వివర్తవాద ప్రవర్తకులు, శుద్ధ బ్రహ్మవాదులు, నైన, శంకరులు అంగీకరించిరా ! అను శంక సహజము. వేద రహస్య వివరణములే ఉపనిషత్తులు. వాటికి విపుల వివరణము, ఉపాసన క్రమము వెలి పరచునట్టి అవసరము కలిగి ఆగమ తంత్రములు ఉద్భవించినవి. జ్ఞానోపాసనలకు అవినాభావసంబంధము శంకరులకు పూర్వము తత్త్వము, సాధనము అవివక్షితముగా లోకమున వ్యాపించి, తత్త్వ భాగమేదో, సాధన భాగమేదో, విడదీయలేకుండునట్లు కువాదములు, కుమతములు ప్రబలినవి. ఈ రెంటికి విశద రూపము కల్పించి, లోకమున వేదోపనిషత్ ప్రయోజన మును, తమ రచనల ద్వారా వివరింపవలసి వచ్చెను. ఈ కారణము వలననే శ్రీ శంకరులు పరతత్త్వ ప్రతి పాదకములగు బ్రహ్మ సూత్రములకు, ఉపనిషత్తులకు భాష్య రచన చేసిరి. సాధన భాగవివరణమునకు ప్రపంచ సారతంత్రము ! సౌందర్య లహరి మొదలగు రచనలు చేసి లోకమునకు మహోపకారము చేసిరి.

ఈ ఉద్యమములోని భాగములోనే వేద సమ్మతములైన షణ్మతములకు (ఆదిత్య - అంబికా, విష్ణు, గణపతి, మహేశ్వర కౌమారములు) విశద రూపము కల్పించి, ఆయా ఉపాసకులకు వాటి తత్త్వసాధనములను రెంటినీ విశదీకరించిరి. శంకరుల స్తోత్ర గ్రంథములలో సాధన మార్గమున భక్తి యొక్క అవినాభావ సంబంధము, దాని ఆవశ్యకత శాస్త్రముతో పాటు నిరూపించిరి. ఈ ఉద్యమము లోనిదే శంకరుల సౌందర్య లహరి రచనము.

సచ్చిదానంద రూపమగు బ్రహ్మయొక్కడే. ఇదే సర్వజగత్తునకు కారణము. ఇది స్త్రీ, పుం, నపుంసక, లింగ వివక్ష లేనిది అయినను ఉపాసనా సౌలభ్యము కొరకు ఇది మాతృభావనతో ఉపాసింప బడినప్పుడు ''పరాశక్తి, గాయత్రి, సావిత్రి, లలిత, త్రిపురసుందరి'' ఇత్యాది వ్యవహార నామములుచేసికొనును. ''ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' అని కదా వినికిడి. నిర్గుణ తత్త్వమునకు ఆకారము కల్పించి మాతృ భావనతోఆరాధించినప్పుడు మనుజునిలో ఆబాల్యము మనస్సు యొక్క







అనుభవ పటలములలో సిద్ధముగా నున్న మాతృప్రేమ, వాత్సల్యము, వీటి అనుభవములు ఉద్బుద్ధములై ఆనందము పెల్లుబుకును.

మాతృప్రేమను ఎరుగని వారుండరు. ఎఱుగని వారికి ఈ తత్త్వము ఆమడ దూరము. సర్వసంగ పరిత్యాగులైన శ్రీ శంకరులకును ఈ మాతృబంధము విడలేదు. జీవితములో ప్రియతమ వస్తువు మాతృమూర్తియే కదా ! ''ఇష్టే వస్తున్యుపచిత రసాః ప్రేమ రాశీ భవన్తి'' అని కాళిదాసుని వచనము. ఇట్టి తఱి మాతృ సుతాను బంధములో పారస్పరికముగా వాత్సల్యము, ప్రేమ, వీటి ఉన్మీలన వికాసములు తేట పడును. సాధకుడు ఇష్టదేవతా మూర్తిని ఇట్టి మాతృభావనతో ధ్యానించి, దర్శించుటయే శ్రీ విద్యా పరమార్థము. అనాది, అనంతమునగు పరమేశ్వర తత్త్వము నిర్గుణమగుటచే, మనస్సునకు అందదు, మాటకు ఆనదు. అగుట ధ్యానయోగ్యముకాదు. అయినను 'నామ రూపాత్మకమగు విశ్వము శివశక్తుల యోగమే' అను ప్రాథమిక జ్ఞానముతో ఉపాసన సగుణము గానే ప్రారంభింప బడును. అవిభాజ్యమగు శివశక్తి తత్త్వములో శక్తియే మూలస్తంభము. శక్తి, శక్తి మంతులకు భేదము లేదు. శక్తిమంతుని సంకల్పము యొక్క అభివ్యక్తియే శక్తి. శ్రీ శంకరులును బ్రహ్మసూత్రం 1-4-3 భాష్యములో ''తదధీన త్వాత్ అర్థవత్'' అను సూత్రము యొక్క భాష్యమునందు పరమేశ్వరాధీనాత్ ఇయమస్మాభిః ప్రాగవస్థాం జగతోభ్యుపగమ్యతే! నస్వతంత్రా! అర్థవతీహిసా! నహితయా వినాపరమేశ్వరస్యస్రృత్వం సిద్ధ్యతి ! శక్తి రహితస్య తస్య ప్రవృత్త్యనుప పత్తేః'' అని వివరించిరి. అనగా శక్తి రహిత 'పరమేశ్వరుడు'' ప్రవర్తింప లేడు. శక్తిస్తవము శక్తిమంతునిస్తవమే యగును. అటులే ఈ యాది శక్తిని ఉపాసించుట, పూజించుట, స్తుతించుట అనగా పరమాత్మను ఉపాసించుటయే. ఇది శ్రీ విద్యా విషయమున ప్రమాణము. ఈ విషయము సౌందర్యలహరి తొలి శ్లోకము ''శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం'' అని శంకర్ధులు వివరించిరి. శ్రీవిద్య కిది పునాదిరాయి.

ఏ గ్రంథమునకైనను నాలుగంగములుండును.

1. ప్రయోజనము, 2. విషయము, 3. ఉపాయము, 4.సంబంధము అనునవి. శ్రీశంకరులే గ్రంధము వ్రాసినను అపరోక్షానుభూతి తప్ప మరొక ప్రయోజనము లేదు. విషయము భగవతీస్తవనము. విద్యా సిద్ధికి స్తవము, తద్వారా నిరంతర మననమే ఉపాయము. మనన రూపమైన సాధనమే మంత్రము ''మననాత్ త్రాయత ఇతి మంత్రః'', అని నిర్వచనము. దీని వలన అపరోక్షానుభూతి కలుగును. ఇదే సంబంధము - ఇది జ్ఞానమునకు ఉత్తమమైన భూమిక, ఇది లభించిన సాధకునికి అహం వృత్తి, దేహాభిమానములు సన్నగిల్లి బ్రహ్మ వృత్తి పెంపొందును - అహంకారము భగవతీ చరణములందు సమర్పించినచో మనస్సు ఉపాస్యదేవతలో లీన మగును. ఇట్టి ధ్యానము అన్య చింతలకు తావీయకుండ ఉపాస్య దేవతా మయముగ ఆంతరమును చేయును. ఇది అభ్యాస సాధ్యము.

''అథాతో బ్రహ్మజిజ్ఞాసా'' యనెడి బ్రహ్మ సూత్రమునకు భాష్యములో శ్రీ శంకరులయభిప్రాయము వివరింతును. అథశబ్దమునకు బ్రహ్మజిజ్ఞాసోపదేశమునకు ముందు కొంత సాధన మావశ్యకము - అనియు, అ శబ్దముచే నిత్యానిత్య వస్తు వివేకము, ఇహపరభోగ వైరాగ్యము, శమ దమ, ఉపరతి, తితిక్షా సమాధానములనెడి వాని సంపత్తి, మోక్షేచ్ఛ కలిగిన తరువాత శ్రవణమునకు, ఉపదేశమునకు సాధకుడు అధికారి యగునని భావము. ''అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః'' అనెడి పాతంజల యోగ సూత్రమందును వివేక వైరాగ్యముల యొక్క ఆవశ్యకత స్పష్టమగును. గీతలందును యోగాచార్యుడగు శ్రీకృష్ణుడు ''అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.'' అని కదా చెప్పెను.

ఇట్టి అధికారవములు గల సాధకుని సాధన సాగగా, సాగగా అభ్యాసమువలన, ఇచ్ఛామాత్రమున శక్త్యున్మేషము, వికాసములు కలిగి, మరల శక్తి శివునిలో నిమీలనమగును. యోగమార్గమేదైనను సాధకునిలో ఇట్టి శక్తి వికాసమే కలుగును. ఉపాసన యోగము కలిసేయుండును. శ్రీ శంకరులు సౌందర్యలహరిలో కుండలినీ యోగమునకు ప్రాధాన్యమిచ్చి ఉపాసన యోగముల ఏకత్వమును సిద్ధాంతితము చేసిరి.





ఈ క్రింది శ్లోకమున వాటి సద్యఃఫలత్వము ప్రమాణీకరించిరి.

శ్లో. భవానిత్వం దాసేమయి వితర దృష్టిం సకరుణాం
ఇతిస్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితియః
తదైవస్మైత్వం తస్మైదిశసి నిజ సాయుజ్య పదవీం
ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుటమకుట నీరాజితపదం

సాధకుడు తన ప్రకృతిలో దేహ ప్రాణ మనో రూపముగా నిద్రించుచున్న తత్త్వమును పరమాత్మలో శరణాగతుడై ఐక్యము పొందించును. ఇట్టి స్థితిలో పరమాత్మ స్పర్శ కొరకు జీవాత్మ పరితపించి ఆరోహణ మారంభించును. పేర్లువేరైనను కుండలినీ యోగ సారమిదే. యథార్థముగా జ్ఞాన భక్తులు వేరు కావు. వీని సముచ్చయమే తారకమని శ్రీ శంకరులు గీతాభాష్యములో నొక్కిచెప్పిరి. క్లుప్తముగా ఇది శ్రీ విద్యలో ప్రతి పాదితమైన యోగ మార్గము. ''జ్ఞాన భక్తులు వేరుకావు'' అను మాటకు ప్రత్యక్ష సాక్ష్యము శ్రీ రామ కృష్ణ పరమహంస జీవితమే.

శ్రీ విద్యాపంచదశీ మంత్రములోను, షోడశీమంత్రములోను గల ''ఈం'' అను బీజము గుప్తమహాసారస్వత బీజమని అభిజ్ఞుల మాట. ప్రత్యేక కవితాఫల దృష్టితో ఈ మంత్రములు జపింపకున్నను అప్రార్థిత ఫలముగ కవిత్వము కూడ సాధకునకు లభించును. ఈ మాట శ్రీ కాళిదాసుని దేవీ పంచస్తవిలో లఘుస్తవమున ప్రమాణితము. శ్రీ శర్మగారును తమ రచనలో ఈక్రింది పద్యములో ఆ భావమును ప్రమాణించిరి. నిజముగ పంచదశియే షోడశి. ఇది రహస్య శాస్త్ర విషయము, వివరణాపేక్షమగుట గురుముఖ గ్రాహ్యము.

తల్లీ ! నీదయలేక యున్న నొక పద్యంబైన శోభిల్లునే
తల్లీలాకృతి నిద్దలంపక మదిన్ దర్పించి పద్యంబులన్
వల్లింతున్ మరి నేనె కర్తగ అహంభావమ్ముతో నందుకా
తల్లీదవ్వుల నుండు దప్పుడపుడున్ తన్మాత్ర శిక్షా స్మృతిన్

దీని అర్థము సులభము.

ఈ పద్యము ఆఖరి చరణములో ''తన్మాత్ర శిక్షా స్మృతిన్'' అనుమాటలో

ఎంతో సొగసున్నది. ఇచట తన్మాత్ర పదము తావన్మాత్రము అను నర్థము కాక 'మాత్రచ్' ప్రత్యయమునకు గల పరిమాణార్థము చెప్పికొన్నచో వీరి పాండిత్యము మనకు సరిగా అవగతము కాగలదు. వీరి రచనలో దేవీ పరతత్త్వ సూత్రము లనదగు లలితా సహస్రనామములలో కొన్ని నామముల పరమార్థమును అనుభవ పూర్వకముగ సమన్వయించిరి. ఇదియే గాక శ్రీ శంకరుల "సౌందర్యలహరి"లో రమణీయ భావబంధురములగు కొన్ని శ్లోకములకు స్వేచ్ఛా వివృతి చేసి శ్రీ శంకరుల ఆశయమునకు వన్నె తెచ్చిరి. ఉదాహరణమునకు మూలశ్లోకముతో శ్రీ శర్మగారి పద్యము నెత్తి చూపగలను. సహృదయులగు సాధక కవులిందలి సుగంధమును ఆస్వాదింపగలరు.

శ్లో. ధనుఃపౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః
వసంతః సామన్తో, మలయ మరుదాయోధనరథః
తథాప్యేకః సర్వం హిమగిరి సుతే కామపి కృపా
మపాంగాత్తేలబ్ధ్వా జగదిదమనంగో విజయతే !

ఈ శ్లోకమునకు అనువాదము (వీరి 26 వ. పద్యము) ఇట్లున్నది.

"అదియా పూల ధనుస్సు, తుమ్మెదలటే జ్యావల్లి, ఐదమ్ములా
పొది, సామంతుడనన్ వసంతుడటే అబ్బో దక్షిణాశా నిలం
బది తేరున్ జననీ హిమాద్రి తనయా అట్లయ్యునీకంటికో
సదయా లేశము తోడగాదటె జగజ్జైత్రుండనంగుండహా !"

శర్మగారి యీ 26వ. పద్యము తొలి మూడు చరణములలో మూలాతిశాయిగా భావమున్నది. ఇందు మూలములో ఒక స్టేట్‌మెంట్ మాత్రముగా నున్న విషయమును ఉపబృంహితము చేసిరి. అల్ప పరికరములగు పూవిల్లు, తుమ్మెదల నారి, ఐదే అమ్ములు, సాలున రెండు మాసములు మాత్రమే దర్శనమిచ్చు వసంతుడు మిత్రుడును. యుద్ధరథము నిల్కడలేని మలయ మారుతముగా గల మన్మథ వీరుడు ముజ్జగములను జయించుట నీ కంటి కొననెనరువలననే అని తమ పద ప్రయోగములో చూపించిరి. మూలములో ఈ పదములు అల్పోపయోగములు గాను, అసమర్థ పరికరములుగాను





స్ఫురించునట్టి ఫణితి లేదు. మూల భావమునకు వన్నె తెచ్చి నపుడే అనువక్త సామర్థ్యము పసిగట్ట గలము. ఈ పద్యము అందుచే స్వతంత్ర రచనగా రక్తి కట్టినది.

సౌందర్య లహరిలో మరియొక శ్లోకమునకు శ్రీ శర్మగారి వివృతి బుధమనోరంజకముగా నున్నది.

శ్లో. త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవత గణః
త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా
భయాత్త్రాతుమ్ దాతుమ్ ఫలమపిచవాంఛా సమధికం
శరణ్యే లోకానాం తవహి చరణావేవ నిపుణౌ.

శ్రీ శర్మగారి పద్యము చూడుడు.

"అమ్మయె చెంతనుండ నభయమ్మేకదా ! కడుపార పెట్టుటే
అమ్మకు సాజమౌకద ! వరాభయ ముద్రలు చూపనేల మా
యమ్మ యభీష్టముల్ తెలిసి అంతకు మిన్నగనిచ్చు నీదుపా
దమ్ములె నమ్మికొంటిని సదామదిలో నిలుమమ్మ ! శారదా !"

ఇందు శ్రీ శర్మగారు మాతృభక్తి భావితులై మూల భావమును వ్యాఖ్యాప్రాయముగ వివరించిరి. తొలి చరణములో తల్లి దగ్గర నున్నచో భయమెందుకు? కడుపార బిడ్డకు కుడువ బెట్టుట ఆమె నైజము. అనియె గాక అభీష్టములు తెలిసి మన కోరిన దానికి యిబ్బడిముబ్బడిగా ఇచ్చునను భావము మూలాతిశాయిగ నున్నది. ఇది బంగారమునకు వెలిగారమువంటిది. శ్రీవిద్యలో మాతృభావనతో పరమేశ్వరుని ఉపాసించుట ఈ ప్రాతి పదికమీదనే.

శ్రీ శర్మగారు శ్రీ విద్యాశాస్త్రమునకు సూత్రములనదగు లలితా సహస్రనామములకు వారి రహోయాగానుభవములనదగు వివృతిని పెక్కింటిని లలిత శైలిలో పద్యపుష్పములుగ చేసి శ్రీమాతృపాద పద్మములందుంచిరి.

'వక్ర లక్ష్మీ పరీవాహ చలన్మీనాభలోచనా' అను లలితా సహస్ర నామభావమును వీరిట్లు సొగసుగా గుబాళింప జేసిరి.

40వ. పద్యము

ముఖలక్ష్మీ పరివాహ చంచల చలన్మద్గాక్షులన్, మీనముల్
సఖులౌచున్ జలకమ్ములాడు చెలువున్ సానందియై చూచి, స
మ్ముఖమందున్ శశిమౌళి సృష్టి సకలంబున్ తద్గణేశాది నీ
ముఖమందున్ ప్రతిబింబితం బగుట సమ్మోదించునో శాంభవీ।

ఇందు భర్తయగు ఈశ్వరుడు తన ప్రేయసియగు పార్వతీ ముఖ సౌందర్య ప్రవాహములో సహజ చంచలములగు ఆమె కంటిమీలు (నేత్రమీనములు) సఖ్యముతో జలకము లాడుచున్నట్లు ఆనందము పొందెనని వర్ణించిరి. ఆమె వక్ర లక్ష్మికి అమ్మవారి ఉన్మీలిత విసారిత సహజ చంచల నేత్రములు నివాళులందించుచున్నట్లు. శ్రీ శర్మగారి భావనయేమో ! ఇట్టి భావనా భాగ్యమును, భావనా గమ్యయగు ఆ తల్లి కరుణా విశేషమే. ఇది గాక ఈశ్వరుడామె ముఖములో తమ ఆత్మజుడైన గణేశునితో పాటు తక్కిన సకల సృష్టియు కాంచె ననుటలో వేదాంతుల మాయా బ్రహ్మముల బింబ ప్రతిబింబ భావము సూచింపబడినది. ఇది శ్రీ విద్యా దర్శనములో కామేశ్వర్యంకస్థిత కామేశ్వరీ తత్త్వము. మూలములో "కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా" అను నామము కామేశ్వరాంకస్థిత కామేశ్వరీ తత్త్వము శ్రీ శర్మగారు రెంటి పరమార్థము తురీయ స్థితిలో రెండిటికి అభేదమ తెలిసిన వారు గావున ప్రవృత్త్యర్థమునే స్వీకరించిరి. ఇది అభిజ్ఞులకే తెలియగలదు.

ఈ క్రింది శ్లోకము శ్రీ శంకరుల దేవీ నవరత్నమాలలో తొలిది. భావమాత్రముగ దానినిచేకొని మూలమునకు భాష్యప్రాయమైన యీ క్రింది పద్యమును మనకిచ్చిరి.





శ్లో. ఓం కార పంజరశుకీం । ఉపనిషదుద్యానకేళి కలకంఠీం
ఆగమవిపిన మయూరీం । ఆర్యాం అంతర్విభావయేగౌరీం

శ్రీశర్మగారి పద్యము పరికింపుడు.

ఓంకార శ్రుతి పంజరాంతర శుకీ । యోగీంద్రరాణ్మానసీ
హ్రీంకారస్ఫుట నాదబిందు కలహంసీ । ఆగమారామజ
శ్రీంకారోజ్జ్వల పింఛ లాంఛితమయూరీ । భావనానంత ధీ
పంకేజాత సహస్రసంచరదళీ । భద్రమ్ము లీయంగదే ।

ఇందు ఆ పరదేవతను సాహిత్య సంగీత నాట్య రసాధి దేవతగా శ్రీ శర్మగారు నిరూపించి శంకరుల భావమును ఉన్మీలింపజేసిరి. ఇదిగాక చరణాది యందు తొలి, మలి, మూడవ పాద ప్రథమాక్షరములుగా ఓం, హ్రీం, శ్రీం అను బీజాక్షరములను లగించి శ్రీవిద్యాగంధ పరిమళమును మనచే ఆఘ్రాణింప జేసిరి. ఆ బీజాక్షరత్రయము సంగీత సాహిత్య నాట్యాది కళలనేగాక చతుర్థ పురుషార్థమగు మోక్షమును గూడ ప్రసాదించగలదని పద్యము నాల్గవ పాదములో "పంకేజాత సహస్ర సంచరదళీ । భద్రమ్ము లీయంగదే". అనుటచే సహస్రార వాసి యగు శివునితో కుండలినీ రూపిణియగు పరదేవత యొక్క ఐక్యము సొగసుగా నిర్వచించిరి. లలితా సహస్ర నామములలో "శివశక్త్యైక్య రూపిణీ" అను చివరి నామము యొక్క భావమును వివరించిరి. "ఓం, హ్రీం, శ్రీం" అను బీజాక్షరముల జపఫలము ఇదే అన్నట్లు శ్రీ శర్మగారు మనలను జాగృతులను చేసిరి. ఇది శ్రీ విద్యకు చరమ యోగ భూమిక. ఇట 'భద్ర' శబ్దము శివ వాచకము మోక్షవాచకము. ఇది కోశప్రమాణితమైన అర్థము. (చూడుడు 'ఆప్టే)

"శారదానంద లహరి"లో సంప్లావనములు, అవగాహనములు చేసిన శ్రీ శర్మగారి వంటి ధన్యులకే యిట్టి రమణీయ భావములు స్ఫురింపగలవు. ఇవి పరదేవతా సాక్షాత్కారమునకు వాఙ్మూలములు. మూలములో ప్రతిపాదాంతము నందు శ్రీ శంకరులు గ్రంథించిన "ఈం" బీజములు నాల్గును షోడశీ మహామంత్రమందలి నాల్గు ఈంకారములను స్మరింప

జేయును. దీనికి ప్రమాణము ''చత్వార ఈం బిభ్రతి క్షేమ మంత్ర..
శ్రుతి వాక్యమే షోడశీ జపఫలము మూలములో వివరింపబడలేదు.
శర్మగారు ఈ విషయమును నాల్గవ పాదములో భద్రమ్మురీయంగాడి
సొగసుగా అందించిరి. భద్ర శబ్దమునకు అర్థము విజ్ఞులకు శివుడు, మోక్ష
తెలిపితిని గదా ! ఇది అంతర్యాగ రహస్య విషయమగుట గురుము
వేద్యము. వీరి 154వ పద్యములో నన్నయ తిక్కనాదుల కవితను అ
గ్రహింప ప్రార్థించిరి. అది యీ వరకే అమ్మ యీయనకు ప్రసాదించిన
నిజముగా ఇది శర్మగారి ''నవ్య భవ్య భరత వాణి'' అనుటకు సందేహ
లేదు.

''156వ పద్యములో'' శ్రీనాథాది కవీంద్రసాంద్ర....'' అనుపద్యముల
శృంగార నైషధ కర్తవలె తమకును అట్టి శ్రీనాథ సనాథమైన శైలిని
గ్రహింపుమని ప్రార్థించిరి. నిజముగ ఈ పద్యము విడిగ చదివినచో శ్రీనా
మహాకవిదిగనే భావింపగలము. ఇందొక విశేషమున్నది. శ్రీ విద్యోపాసకుల
నిత్యపూజలో శ్రీ విద్యా సంప్రదాయక ప్రవర్తకులలో ఆద్యులైన శ్రీనాథ
గురుత్రయము నిత్యస్మర్తవ్యము. దానిని కూడా శ్రీ శర్మగారు ఉ
పూర్వకముగా మనచే స్మరింప జేసి సంప్రదాయమునకు గౌరవము
చేకూర్చిరి.

ఇట్లు వీరి ప్రతి పద్యము వివరణ సాపేక్షము. అనుభవ సంభావితము
కవితా రసాలయముగ శోభించుచున్నది. విషయమును బట్టి భాష
కొన్నిట శిరీష పేశలత్వము, మాధుర్యము చిప్పిలుచున్న
అనుభవావిష్కరణములో ప్రౌఢత యున్నది. ఇది అలంకారమేగా
అవరోధము గాదు.

శ్రీ శర్మగారు శబ్ద బ్రహ్మవేత్తలు, పరిణత ప్రజ్ఞాలును. అందువలనన
విద్యార్థ బంధురము యోగానుభూతి విభావితమునగు ఈ గ్రంథము రచి
వారి కధికారమున్నది.





''పశ్యవాచః కవేర్వాక్యమ్, సా చ రామాశ్రయా కథా
లబ్ధశ్చి వాక్యనిష్యంద నిష్పేష ని కషోజనః'' అని

భవభూతి విషయములో వస్తు ప్రాశస్త్యము, కవి సామర్థ్యము తులారోపణము చేసి లోకము సన్మానించినది. శ్రీ భరత శర్మగారి విషయములో గూడ అదే సామ్యము - ఇది నా నికషమైన అభిప్రాయము. వీరు శ్రద్ధారాద్ధ గురువులు. వీరి రచనములో గురుముఖైక వేద్య శాస్త్రవిషయములు క్వాచిత్కముగ నున్నవి. అవి గురుకృపైక వేద్యములగుట వివరింపలేను. సాహిత్య దృష్టితో అనుశీలనము చేసిన వారికి ఇది సాహిత్య పీయూష చషకము. ''ప్రథమాలీఢ మధవః పిబన్తికటు భేషజమ్'' అను అలంకార శాస్త్ర ప్రమాణముచే తేనెతో రంగరించిన కటువైన ఔషధము బిడ్డలు స్వీకరించునట్లు, కష్టమగు శాస్త్ర విషయములు కూడా వీరి కవితా మధువు అనుపానముగా సుబోధమైనవి. శాస్త్ర దృష్టితో నా పరిశీలనము బహుశః సాగిన దగుటచే గ్రంథమందలి సాహిత్య సౌందర్య వివేచనమునకు తగు చోటు ఈ లేకుంటిని. ఇందు నా అధికారము మాటయు అంతంతే -

శ్రీ భరత శర్మగారి ''శారదానంద లహరి'' అను ఈ కృతి రత్నము వాగ్దేవి శిరస్సున నిత్య ధార్యమగు శిరోభూష. వారు పరదేవత పాద పీఠమందు సమర్పించిన ఈ పద్య కుసుమములు మ్లానమెరుగని సంతానక పుష్పములై నిలుచుగావుతమని, ఆ పరదేవతను అర్థించుచున్నాను.

ఇట్లు
సాధక పాదపాంసువు
**డా. ఈశ్వరసీతారామ ధన్వంతరి**
అధ్యక్షులు ఉపనిషన్మందిరము.
అధ్యక్షవ్యవస్థాపకుడు
**''మహతి''**
సాహితీ సాంస్కృతిక సేవా సంస్థ, శ్రీకాకుళం

శ్రీం

''వ్యాకరణాలంకార చక్రవర్తి'', సాహిత్య విశారద''
అప్పల సోమేశ్వర శర్మ, ఎమ్.ఏ, పి.ఓ.ఎల్.
(విశ్రాంత సంస్కృతాచార్యుడు, ఆంధ్ర విశ్వకళాపరిషత్,
విశాఖపట్టణము -3)

## సాధువాకము

''అవధాన సరస్వతి'' శ్రీ పేరాల భరత శర్మగారు సంస్కృతాంధ్ర సాహిత్య పార్య భార తములు. ఎన్నో సువర్ణాభరణాలను స్వయంగా తయారు చేసి, సుమనో – మనోహరంగా వాగ్దేవతా కంఠ సీమ నలంకరించి, ప్రశంసలందుకున్న పరమ సౌవర్ణికులు – అక్షర శిల్పులు. మా యిద్దరికిన్ని ఏర్పడిన మైత్రి – సాహితీ మైత్రి కూడా అన్యాదృశము. భవభూతి మహాకవి ''ఉత్తరరామచరిత'' రూపకంలో లోకోత్తరంగా నిర్వచించిన మైత్రి అది. ''స్నేహశ్చ నిమిత్త సవ్యపేక్షశ్చ ఇతి విప్రతిషిద్ధమే స్నేహానికి ఒక నిమిత్తముంటుందనడం తప్పు. ''వ్యతిషజతి పదార్ధానాంతరతి కోపి హేతుతత్ చెప్పజాలని హృదయ తంత్రీ నాదసంవాదం వల్ల అనురాగం ఏర్పడి వర్ధిల్లుతుంది) ''తత్తస్య కిమపి ద్రవ్యం యోహి యస్య ప్రియోజనః – మిత్రులకు గల పరస్పరానురాగం అనుభవైక వేద్యం ఇది ! ఆ మహాకవి మాటలు ! వీటికి మా యిరువురి ప్రీతియే ఉదాహరణము.

ఇంచుమించు పాతికసంవత్సరాలకు పూర్వం శ్రీ శర్మగారు వారి రచన ''కాదంబరీ రసజ్ఞత''ను నాకు పంచినారు. (విశ్వకళాపరిషత్తు – సంస్కృత విభాగంలో) అదే మా తొలి పరిచయమని గుర్తు. తరువాత మా బోట్లకు మాతృ సంస్థ అయిన విజయనగర సంస్కృత కళాశాలకు అధ్యక్షులుగా ప్రకాశించిన రోజుల్లో వీరు నాకు అవ్యాజానురాగాన్ని అందించి, ఆదరించి ఆ పరిచయానికి చిన్నెలు – వన్నెలను తీర్చి దిద్దినారు. ఇటీవల విశ్రాంతిని పొంది విశాఖ మహానగరంలో స్థిరపడిన నాటి నుండియు శ్రీ శర్మగారు నన్ను సాహిత్య సౌహిత్య పురోహితులుగా గౌరవిస్తూ మా స్నేహమహా వటవృక్షానికి



ఊడలను కూడా పెంచినారు. అది ఆత్మానుభవం – ఆనందానుభవము. భవతు !

ప్రకృతం ఈ ''శారదాలహరి'' వీరి ''ఆత్మానందలహరి'' అని నేను గట్టిగానే అనగలను. ఆ లక్షణాలు ఇందులో పుష్కలంగా కనిపిస్తాయి. సోమేశ్వరశర్మ గారూ ! నా ''శారదాలహరి''ని గురించి రెండు మాటలు ఆశీర్వాదరూపంలో వ్రాయండి అని నన్ను కోరినారు. అది వారి రస హృదయానికి తార్కాణం! మైత్రీ ప్రభావానికి నిదర్శనం! ''ఓమ్'' అన్నాను. మరొక్క చిన్న హేతువు కూడా ఉంది. శ్రీ భరతశర్మ కవి, సహృదయులు కూడా. శ్రీ సోమేశ్వర శర్మ సహృదయుడు మాత్రమే ! కవి సహృదయులిద్దరున్నూ ఉంటేనే గాని, సారస్వతం శోభించదు. అందువల్లనే ''సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే'' అని అభినవ గుప్తుడు ఏనాడో తీర్పు చెప్పినాడు. అస్తు !

''శ్రీ శారదాలహరి''లో పూర్తిగా మున్కలు వేసినాను – ఉక్కిరి బిక్కిరి అయ్యేను. ''భజే శారదాంబా – మజస్రం మదంబామ్'' అని ఆదిశంకరులు స్తుతించిన శారదాస్తవమిది. శ్రీ లలిత, త్రిపుర సుందరి, మహాకామేశ మహిషి అయిన జగజ్జనని ప్రశంస. కవికి సదా పరమారాధ్య అయిన పరభట్టారికా ప్రార్థన. ''ఉద్యద్భాను సహ స్రాభా'' మొదలైన వెయ్యి నామాలతో వెలిగిన శ్రీ పరమేశ్వరీ సమక్షంలో సాగిన ''కావ్యాలాప వినోదము''. తమ తత్త్వ గురువులయిన శృంగగిరి భారతీ తీర్థ మహా స్వామికి శారదకున్ను అభేదాన్ని భావించి, ''తత్త్వమసి'' అని, కొంతసేపు ''సోఽహమ్'' అని మరికొంత సేపున్ను, కవి తన అనుభవాన్ని ప్రస్తరించిన శ్రీ శివ శక్త్యైక్య సమారాధనము. శ్రీ చక్ర ప్రస్తార రహస్యాన్ని సొగసుగా మలచిన రహస్య సమామ్నాయము. ఇది నా సామాన్య మయిన భావనా సంగ్రహం. సమీక్ష కాదు – అదే అయితే పెద్ద వ్యాఖ్యానమే అయి కూర్చుంటుంది ! ఏమయినా శ్రీ భరత శర్మగారు భగత్పాదులు చెప్పిన

దుర్లభమైన మూడు ధర్మాలు గలిగినవారు. ''మనుష్యత్వం ముముక్షుత్వం, మహా పురుష సంశ్రయము'' అన్నవే ఆ ధర్మాలు. వీరు ధన్యులు ! వీరి కోరికలను శ్రీ శారదాంబ తప్పక తీరుస్తుంది. ఆమె ''భక్తప్రియ - భక్తి గమ్య - భయాపహా!''

మరిన్ని - శ్రీ భరతశర్మగారు సకలలోకారాధ్య అయిన జగదంబను మనసార సేవించి తదభిన్నులయిన శ్రీ భారతీతీర్థులకు శిరసా అంజలులు ఘటించి - తమ ఆర్తిని విన్నవించుకుని, భక్తి జ్ఞానవైరాగ్యాలతో చిట్ట చివరకు ''ఆత్మానందము కోసమే తలతునంబా! శారదా! ప్రోవవే'' అని ''మాంపాహి హే! శారదా!'' అనిన్ని జగదంబకు శరణాగతిని నివేదించుకున్నారు. ఆమె వీరి విన్నపాన్ని మన్నిస్తుంది - మన్నించు గాక !

శ్రీ శారదా లహరి భక్తులకు కొంగు బంగారము, ముముక్షువులకు ముక్తి కాంత, శ్రీ శారదా కిరీట మాణిక్యాలలో ఒక మహా మాణిక్యమున్ను అగుగాక! అని నా శుభాశంసనము. ఈ రెండు మాటలను వ్రాయుమన్నందుకు నా కృతజ్ఞత. ''సాధు ! భరత శర్మన్ ! సాధు - సాధు !'' అని నా అభినందనము.

శ్లో. **శారదా సర్వదా శాంతా ! శాంత్యతీత కళాత్మికా !**
**పాయా భరత శర్మాణత్ ! మాయురారోగ్య వైభవైః !!**

అని నా ఆశీస్సు. ''తథాస్తు''

విశాఖపట్టణము - 13
**తేది 19-9-98**

సహృదయసేవి
**అప్పల్ల. సోమేశ్వర శర్మ**



శ్రీమాత్రేనమః శ్రీ శారదాంబాయైనమః

## నా ధ్యేయాకృతి

శారద వాగ్దేవత. అక్షర స్వరూపిణి. లోకవ్యవహారమంతయు వాక్కు చేతనే జరుగుచున్నది. వాక్కు లేనిదే వేదములు పలుకబడవు. దేవతలు తెలియబడరు. లోకములందలి సర్వ విషయ పరిజ్ఞానము వాక్కు వలననే - ఈ జగత్తు సర్వము తెలియుటకు మూలము - వాక్కు - వాక్కుచే పేర్కొన బడుట చేతనే లోకము యొక్క నామ రూపములు తెలియుచున్నవి.

ఇది స్థూల జగత్తు - దీనికి మూలమైనది సూక్ష్మ జగత్తు - దానికి కారణమైనది కారణ జగత్తు - అది ఆకాశము - ఆ ఆకాశమన్న సరస్సులో విరిసిన పద్మము - వాగ్రూపము - దానిచే తెలియబడిన మొదటి దైవము బ్రహ్మ. ఆ బ్రహ్మకు నాలుగు దిశలందు ముఖములు - వాని నుండి నాలుగు వేదములు - ఆ వేదములచే వేద్యమైన పరబ్రహ్మము - జగన్మూలము - కనుక జగన్మాతా పితరులు - వాగర్థ రూపములైన - శారదా చతుర్ముఖ మిథునము. ఈ మిథునము వ్యక్తమైన పద్మము ఆకాశపు నడి బొడ్డున విరిసినది. ఆ ఆకాశము మూలము - అందు విరిసిన పద్మము యొక్క కర్ణిక యందున్నది - వాగ్దేవత. ఆ పద్మమునకు పదునారు దళములు - ఆ దళములు - బ్రహ్మ విష్ణు రుద్ర సర్వేశ్వర చతుర్మూర్తులు వారి కొక్కొక్కరికి, నాలుగు శక్తులు - సృష్టి స్థితి లయ సర్వేశ్వరత్వములు సర్వ సర్వేశ్వర చతుర్మూర్తి, సాక్షి, పరబ్రహ్మములు నాలుగు. అవి షోడశ దళములు - అట్టి పద్మము యొక్క కర్ణిక యందున శారద - సృష్టిలోని ప్రాణికోటికి స్థూల సూక్ష్మ కారణ రూపమైన కర్మ ఫలము (శార - తద్దదాతి ఇతి శారద) ఇచ్చునది శారద. అట్టి కర్మఫలరూపమైన జన్మ పరంపర శార - దానిని ద్యతి - ఖండయతి జ్ఞాన రూపమున త్రుంచి వైచునది శారద. కనుక ఈ దేవత భుక్తి ముక్తి ప్రదాయిని. అని పద్మపాదాచార్యుల వారి వివరణ.

ఆ శారద పరా పశ్యన్తీ మధ్యమావైఖరీ రూపములతో నాభి హృత్ కంఠ నాసారసనాదులయందు శోభిల్లుచున్న ప్రత్యక్ష పరమేశ్వరి.

ఆమెయే ''సృష్టికర్త్రీ బ్రహ్మ రూపా
గోప్త్రీ, గోవింద రూపిణీ
సంహారిణీ రుద్రరూపా
తిరోధానకరీశ్వరీ
సదా శివాను గ్రహదా
పంచకృత్య పరాయణా''

ఈ పంచకృత్య విలసితమే ప్రపంచము.

అట్టి ఈ ప్రపంచమున విహరించుటకు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమైన 'హంస' సమస్త ప్రాణికోటి యందునున్నది. హంస అని తెలిసిన తెలియక పోయినా ఈ శ్వాస క్రియలేని ప్రాణి లేదు. ఆ హంసయే తన వాహనముగా చరా చర జగద్విహారము చేయుచున్న శారద ''ధ్యాన ధ్యాతృ ధ్యేయ రూపా'' ''చారు రూపా, చారుహాసా, చారు చంద్ర కళాధరా''.

ధ్యాత యొక్క ధ్యానము ధ్యేయమును పొంద గలిగినంత ప్రగాఢమైనచో ధ్యేయ రూపిణి యైన శారద ఆనంద లహరి యగునన్న విశ్వాసముతో జీవిత పర్యంతము చేసిన భావనా రూపమైన వాగ్వివర్తమే ఈ పద్య సంపుటి.

ఆమె ''భావజ్ఞ'' ''ఛందస్సార'' ''శాస్త్ర సార'' ''మంత్రసార'' సారద శారద. ''వర్ణ రూపిణి'' ''సకలాగమ సందోహ శుక్తి సంపుటి మౌక్తిక'' ''పురుషార్థ ప్రద''

''స్వరములు వర్ణముల్ పదము పాదము గానముకైత నీవుగా
వరలిన వాఙ్మయాకృతివి వాక్కున నిల్వ గదమ్మ చంద్రికా
స్ఫురిత సుధా స్రవంతికల పొల్చిన పద్మ సరః స్సరస్వతీ,
సరస రసాకృతీ రుచిర సాహితి భారతి శారదా సతీ''

ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికమైన సర్వ వివేకమునకు మూలమైనది పూర్వ వాఙ్మయము. అట్టి వాఙ్మయమును లోకమునకు ప్రసాదించిన పూర్వ కవులందరకు ఇదే మా నమస్కారము – పరమాత్మ కళా రూపిణియైన ఆ



వాగ్దేవికి ఇదే మా నమోవాకము – అని భవభూతి చేసిన నమస్కారమే సర్వ కవులు చేయదగినది.

''ఇదం కవిభ్యః పూర్వేభ్యో
నమో వాకం ప్రశాస్మహే
వందేమహించ తాందేవీ
మమృతా మాత్మనః కలామ్''

''పురాంధ్ర సంస్కృత కవీశ్వర భారతి దీప్తి'' కిదే మా నమస్కారము.

శృంగేరిలోని శారదా పీఠము వాగ్దేవతా పీఠము – శంకరభగవత్పాదులచే ప్రతిష్ఠితమైన ఆ శారదా పీఠమునందు మహావిద్యా నిధులైన పరమహంసలు ప్రత్యక్షదైవములై జగద్గురువులైనారు.

నా భాగ్య వశమున ప్రస్తుత పీఠాధిపతులు శ్రీశ్రీ భారతీతీర్థ స్వామివారు నా యందు ప్రసరింప జేసిన అనుగ్రహ ఫలమే ఈ ''శారదా నందలహరి''. ఆ జగద్గురువులు ఇందలి పద్యములను ఆలకించి ఈ కావ్యకన్యను ''శారదానందలహరి'' అని ఆశీర్వదించినారు. స్వామి నాయందు ప్రసరింప జేసిన కృపాదృక్ ప్రసారము నా జీవిత ఫలసారము.

''స్వామి యను గ్రహించె మనసా వచసా రసవత్పరిస్క్రియా
భూమికయా, మదీయ మగు బుద్ధి ప్రచోదన సేయు భర్గమా
ధామమునందు జన్మకును ధన్యత గూర్చెడు చూపునిల్పె ప్ర
జ్ఞామతి భారతీహృదయ గహ్వరమున్ తిలకింప జేయుచున్''.

వారి పాద పద్మముల పై శిరసుంచి నమస్కరించుచున్నాను.

సహృదయ పాఠక మహాశయులీ గ్రంథమును
అనుశీలించి ఆదరింతురని ఆశించుచున్నాను.

పేరాల భరతశర్మ

## నా నమస్సుమాంజలి

మంగళా శాసన శ్రీ ముఖమును ప్రసాదించిన జగద్గురువులు
శ్రీ శృంగేరి శారదా పీఠాధిపతులు శ్రీ భారతీ తీర్థ స్వామివారికి
మంగళ కామన దివ్యాశీస్సులు ప్రసరించిన ఉపనిషద్విహార

శ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతీ స్వామివారికి
నాయందు నిత్య ప్రసన్నులై శివాను గ్రహ ప్రదానము సేయుచున్న
ఆనందవన విహారులు
సద్గురు శ్రీ శివానంద మూర్తి గారికి.

## నా కృతజ్ఞతాంజలి

"శారదానందలహరి"లో
"అవగాహనము" కల్పించిన ప్రవచన శిరోమణి ఉభయ వేదాంత
ప్రవర్తకులు
శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యుల వారికి
"వాఙ్మఖము" నావిష్కరించిన శ్రీ విద్యా తత్త్వ వేత్తలైన
డాక్టర్ ఈశ్వర సీతారామ ధన్వంతరి గారికి
"సాధువాకము" పలికిన "వ్యాకరణాలంకార చక్రవర్తి"
"సాహిత్య శిరోమణి"
శ్రీ అప్పల్లసోమేశ్వర శర్మ గారికి

## నా అక్షరాభినందనలు

శ్రద్ధాభక్తులతో ఈ గ్రంథ ముద్రణ చేసిన
"స్వా" ప్రెస్ నిర్వాహకులకు

లహరీ భావ స్ఫూర్తితో ముఖచిత్ర రచన చేసిన
శ్రీ బాపు గారికి





శ్రీ గురుపాదుకా నిహిత చిత్తమ హంస యనంగకామరా
జాగమ బీజయుక్తి నొక అక్షరలోకము మానసమ్మునన్
మ్రోగిన వీణగా మొరసి మోహన హంసముపైన శారదాం
బాగమమున్ ధ్వనింప మనసార నుతింతు తదేక తానతన్ 1

మోహన శారదా మధురమూర్తికి మంజుల వాగ్విలాస స
మ్మోహన కీర్తికిన్ స్వరిత ముగ్ధ మనోహర వేద వల్లికిన్
వాహన హంసరాజమున నా యెదలో విహరించు తల్లికిన్
సాహితిలో సుధల్ జిలుక సన్నుతి జేసెద నక్షరాంజలిన్. 2

వేణురవమ్మొ నా హృదయ వీణియ మీటిన నీదు కంకణ
క్వాణమొ జన్మజన్మలుగ పట్టిన యే ప్రణవ ప్రభావమో!
ఐణవిషాణ మౌని హృదయ స్ఫురితంబగు వేద నాదమో!
ప్రాణములందు నీయునికి పట్టుల నన్గదలించె శారదా! 3

కైతలుకావు నా మనసుగాంచిన వ్రాతలు నీదు చేతలై
నాతలపుల్ మలంచినవి నన్గదలించుచు నుంటి తల్లి! యీ
నా తను హృద్వచస్సులను నాదమయమ్ముగఁ జేయవే విపం
చీతత తాళ సంగతుల చిందెడు సత్కృపతోడ శారదా! 4

# శారదానందలహరి

శారద సర్వవాఙ్మయ విశారద శారద చంద్ర చంద్రికా
సారరస ప్రసార, పదసంపదలంకృత రూపవైభవో
దార, సరోజ సంభవ హృదంతర లీన విమర్శభావనా
ధార జగద్గురు స్తుత సదాతని మాకు ప్రసన్న యయ్యెడున్! 1

బ్బాల శశాంక శేఖర విభావిత రాజిత చక్రరాజ వి
ద్యాలయ శ్రీకలామయి మహాత్రిపురేశ్వరి ఈశ్వరార్ధవా
ఙ్మాలిక కాలికాభిధ రమాగిరిజా భువిజాది రూపముల్
చాలగ నౌ జగజ్జనని శాంకరి మాకు ప్రసన్న యయ్యెడున్! 2

ఫాల శశాంక లేఖపయి వ్రాలిన ముంగురు లక్షరాకృతిన్
గ్రాల నుమాముఖాబ్జమును గన్గొని చంద్రకళాధరుండు కాం
తా! లలితాక్షరాభ్యసన తత్పర మీ చలితాధరమ్ము శి
క్షాలసమన్న నవ్వుకొను శాంకరి మాకు ప్రసన్న యయ్యెడున్! 3

ఫాలమునందు ప్రాంతముల వ్రాలిన ముంగురులన్ దొలంచు కెం
గేలి రుచుల్ భవుండుకని ''కేవల సాత్త్విక మూర్తిగావు నీ
వోలలనా! రజోగుణము నొప్పి తమస్సున మున్గు'' దన్న మీ
చాలునఁ బోపుదంచునగు శాంభవి మాకు ప్రసన్న యయ్యెడున్! 4

శంభుని వామ భాగము ప్రజాపతి నాల్గు మొగాల వాక్క్రియా
రంభము మాధవ ప్రణయ రాగ మనోహర గీతికా సమా
రంభము శ్రీ కలామయ విలాస కలాపము మల్లికా ప్రసూ
బంభర నాద బృంహితము భావము మాకు ప్రసన్న మయ్యెడున్! 5





శారదకున్ జగద్గురుల సన్నిధిలోన నుపాసనన్ సహ
స్రారమునన్ సుధల్ జిలుకు చంద్ర కళాస్స్రు హణీయ బిందు సం
సారిణికిన్ కృత ప్రణవ నాదకు శ్రీ పరమేష్ఠి చిత్కళా
ధారకు శృంగశైల రసధానికి వాణికి నంజలించెదన్! 6

భారతి తానుగా నుభయ భారతి - మండన మిశ్రులన్న పుం
భారతి - పూజ్యశంకరుల పట్టున నిల్చిన పీఠమందు శృం
గేరిని నేలుచున్న దగు కేవల శారద పద్మయోని హృ
న్నీరజ కర్ణికాగ్ర రమణీమణి మాకు ప్రసన్న యయ్యెడున్! 7

అర్థము స్వామియై పలుకులన్నియు నీవయి యున్నతల్లి! నా
స్వార్థము మీరలిద్దరయి పట్టుగ నిర్వురు మీరు భారతీ
తీర్థులయందు నొక్కరని తేలగ తీర్థము సేయవచ్చితిన్
ప్రార్థన నాలకించి రసవార్థిని తేల్పగదమ్మ శారదా! 8

ఒక్కడు నేన్గుమోమున మఱొక్కడు నారుమొగాల తోడ నీ
యక్కున పాలుద్రావ జగమంతయు బిడ్డలగన్నతల్లి! నీ
వెక్కడ నుండి చేపుకొనెదే! యిన గోళము చంద్రగోళమున్
దక్కక నీవురమ్మునను దాల్పక యున్ననహర్నిశల్ సతీ! 9

నీ పదయుగ్మకాంతి రమణీయత కోడి సరోజషండముల్
కాపుగఁ దెచ్చికొన్న రవి కాంతులు వెల్వెలఁబోవు నీ యెడన్
నూపుర మంజుశింజిత మనోహర ఝుళాఝుళీ ఝుళం ఝుళ
ద్రూపిత నాద మాధురుల రూక్షములైచను హంస రావముల్! 10

అంచలు నీ పదంబులను నబ్జములంచుఁ దలంచి ప్రీతి సే
వించగఁ జేరి నీ నడచు వేడుక మై మరపింప వింతలౌ
నంచు త్వదీయ యానముల నాత్మగతుల్ సవరించు కొంట భా
వించి నుతింతు నిన్ను రసవీథుల చంద్ర కళా విధాయినీ! 11

అమ్మ! కృపాకటాక్షముల నాదుకొనం గదవమ్మ! నీదు పా
దమ్ములె నమ్ముకొంటిని గదమ్మ! మదంబ! ముదంబు తోఁడ సా
హమ్మను సాహసమ్ము నిడవమ్మ! సుధాంబుధి చేర నిమ్మ! ఓ
యమ్మ చిదంశు చంద్రికల నానగనిమ్మ కళావతంసినీ! 12

తల్లియుఁ దండ్రియున్ గురువు దైవము శంకర తీర్థపాద ధీ
వల్లరి ఁబూచినట్టి ప్రసవమ్ములుగా భువి నెల్లకాలమున్
జెల్లును శృంగ శైలమున శ్రీ పుర భూపుర కాపురమ్ములన్
తల్లివి నీవె కాచుకొను దానవుగా త్రిజగమ్ము శారదా! 13

చంద్రకళా విధాత మనసారగ నీతనువందులీనమై
యింద్రియముల్ దివాకరుడు నింద్రుఁడు చంద్రుఁడు దేవతాళి ని
స్తంద్రత నీదురూపమునఁ దాల్పఁగఁ జేసి జగాల నీదయా
చంద్రికలన్ వెలార్చుటను సారద వీవె కదమ్మ! శారదా! 14

పదపద మీవుగా నడచి వచ్చిన పాదము పాదమౌను సం
పదలకు మూదలౌను రసవార్ధుల నీదుటకౌను నీ కృపా
స్పద పదలాక్షరక్షణకు పట్టగు పుట్టువు ధన్యమౌను నీ
పెదవుల కెంపుసొంపునకు వెన్నెల నీ చిరునవ్వు శారదా! 15





తనువు పటుత్వమున్ సడలి తల్లివి నీవయి కాచుకొంటచే
తను విది నాదియంచు నొకదారికి వచ్చెను గాక, తల్లిరో
తను విది శాశ్వతం బొకొ! సుధల్ చిలుకంగను ఁజాలు కుంభమై
నను తరియింతు నీకరమునన్ బడినన్ దయఁ జూడు శారదా! 16

చిన్న తనమ్మునుండి నిను చింతన సేయుట చేతగాఁక నీ
సన్నిధి నుండి కూడ కనుసన్నల పెన్నిధిగాన నైతి – నీ
వన్నరస ప్రవాహమని అద్భుత భావతరంగ మాలికా
స్విన్న గిరాం నిధానమని చెప్పిన వారెవరమ్మ శారదా! 17

అర్థమెఱుంగ భావమది యంతకు ముందె యెఱుంగ నెవ్వియో
యర్థమ పార్థమున్ దెలియ నట్టివి వ్రాయుచునుండ నందులో
నర్థము వాగ్విలాసములు సన్నియు నీవనిపించు భారతీ
తీర్థజగద్గురూత్తముల తేటఁ దనమ్మున తల్లి! శారదా! 18

కాలము నందు నిల్వగల కావ్యరసజ్ఞుఁడు కాళిదాసు, ష
ట్కాల భవాభిషేకరస గంధిలుఁడా భవభూతి, వాగ్విలా
సాల మహార్థ భావుకులు సత్కవి తల్లజులైరి వారు వా
గ్జాల మెఱింగి యర్థముల చాయలఁ బోయిన వారు శారదా! 19

స్వరములు వర్ణముల్ పదము పాదము గానము కైత నీవుగా
వరలిన వాఙ్మయాకృతివి వాక్కున నిల్వ గదమ్మ! చంద్రికా
స్ఫురిత సుధా స్రవంతికల పొల్చిన పద్మ సరస్సరస్వతీ!
సరస రసాకృతీ! రుచిర సాహితి! భారతి! శారదా సతీ! 20

మల్లీ జాతి తుషార హార హిమరుజ్మంజు ప్రభాలీ తనూ
వల్లీ! శ్రీశ గిరీశ ధాతృముఖ దేవవ్రాత సంపూజితా!
చిల్లీలాకృతి! శ్రీ సరస్వతి! విపంచీరావ సంచారిణీ!
తల్లీ! నన్దయఁ జూడు వాఙ్మయ రసాఢ్య శ్రీమనోల్లాసినీ! 21

మదమత్తద్విపయాన సుందరపదా! మాణిక్య వీణారవా
స్పద కంఠస్వర రాగరంజిత పదా! సంగీత సాహిత్య సం
సదలంకార గుణాభి భూషిత పదా! స్వాయంభువ ప్రాభవ
ప్రదవాణీ ముఖరాగ రంజిత పదా! పాలింపవే శారదా! 22

అమ్మయె చెంతనుండ నభయమ్మేకదా! కడుపార పెట్టుటే
అమ్మకు సాజమౌకద! వరాభయ ముద్రలు చూపనేల మా
యమ్మ - అభీష్టముల్ తెలిసి అంతకు మిన్నగ నిచ్చు నీదు పా
దమ్ములె నమ్ముకొంటిని సదా మదిలో నిలుమమ్మ శారదా! 23

కింకిణి కుంకుణు స్వనము క్రేవల తల్లి చరించు ముచ్చటై
అంకముఁ జేర ప్రాకెదను నందని నెన్నడుమున్ మదేభ కుం
భాంకము నైనవక్షమున నానతవౌచు ననున్ గ్రహింపు మీ
నాంకుని నుద్ధరించిన మహాజననీ! కరుణాంత రంగవై! 24

చంపక మల్లికా వకుళ సారస గంధిలమైన దిక్కులన్
నింపితి వమ్మ నీ కరుణ నీరజ పత్ర విశాల నేత్ర! క
వ్వింపకు పుష్పబాణుని నవీనము భస్మము చంద్రమౌళిమై
నింపకు స్వామినేడు నిను నీడగఁ బాయడుఁగాదె శాంభవీ! 25





అది యా పూలధనుస్సు, తుమ్మెదలటే జ్యావల్లి, ఐదమ్ములా
పొది; సామంతుడనన్ వసంతుడటె అబ్బో! దక్షిణాశానిలం
బది తేరున్ జననీ! హిమాద్రి తనయా! అట్లయ్యు నీకంటి కో
స దయాలేశము తోడగాదటె జగజ్జైత్రుం డనంగుండహో! 26

రాగము తోడ క్రోధమున రాయిడియైన మనమ్ము తోడసి
యాగమనమ్ము గోరెడు మహాసుర రావణలక్షణమ్ము నే
లాగున విస్మరించెదము రాగము పాశము, క్రోధమంకుశం
బై గుణముల్ శరాసనమునందున బాణములైన తల్లిరో! 27

అంబా! అంబుజ గర్భురాణివా! హిమాహార్యాత్మ జామాత డం
బంబారన్ మెయిఁదాల్చినట్టి సతివో! పద్మాక్షుహృత్పద్మ మం
దుంబీఠంబునుఁ బెట్టి నట్టి సిరివో! తోచంగ రావే తురీ
యంబౌమాయవా! అంతుపట్టవుగదే! ఆబ్రహ్మ సంసారిణీ! 28

సంసారంబున సారవంతమగు ప్రజ్ఞన్ కావ్య సల్లాప మా
శంసింపంగ భవత్పదాబ్జముల విశ్వాసమ్మునం బట్టితిన్
సంసారార్ణవమున్ దరింపగల విజ్ఞానమ్మునం దల్లి! సోఽ
హంసంభావన హంసయానమున నాకందింపవే శారదా! 29

ఉద్యద్భాను సహస్రకోటి రుచులందు ప్పొంగు తేజమ్మునన్
విద్యానందము వెల్గుమొల్కలను నావిష్కారమున్ జేయు త
ల్లీ! ద్యావా పృథివీ పదాంతర జగల్లీలా సవిత్రీ మత
ల్లీ! ద్యోమార్గ ధునీ తరంగములఁ జల్లింపంగదే ధీగతిన్! 30

రాతిరి నీ స్వరూపమయి జాతిని మేల్కొలుపంగ నన్ను నీ
వ్రాతల తోఁడబుచ్చెదను రాతిరి రాతిరి యంతయున్ తను
త్రాతవు నీవెయైన మరి తట్టు కొనంగలదే? శరీరమో
మాత ! మహౌషధంబవను మాట యొకండదది నిల్పుకోగదే ! 31

అపరాధమ్మును సైపు మమ్మ కవితావ్యాసంగ పారీణవై
కృపతో రాత్రి పవల్ మదేక మతివై కీర్తింపగాఁ జేయు ని
న్నపలాపించితి నిద్ర పోగొడితివం చానిద్రయున్ భద్రమున్
విపులం బైన భవత్ప్రసాదమని భావింపంగ లేనైతినే ! 32

ద్వైధీ భావము చేత నిట్టు లగు జేతంబన్ పరామర్శతో
స్వాధిష్ఠానముఁజేరి తెల్పెదవొ అద్వైతామృతానందల
క్ష్మీ ధీనైచికివైన నీవె కద లక్షింపంగ వాగర్థముల్
బోధన్ క్షాళనఁ జేయు చుంటికదె సంపూర్ణాత్మ చైతన్యవై ! 33

అన్నీ నీవని సర్వభూతముల యందాత్మ స్వరూపమ్ముగా
నిన్నున్ గొల్చిన వారు ప్రాణితతిలో నిద్రాస్వరూపమ్ము నీ
దన్నన్ బుద్ధియు నీవెయున్న అది నాకర్థమ్ము కాదాయె రా
త్రిన్నిద్రన్ మరి శ్వాసయాడు క్రియ తల్లీ ! కైతలన్ పల్కదే ! 34

నానా వర్ణ పద స్వరార్ణవ తరంగ శ్రీక వీణా ధ్వని
ప్రాణా ! ప్రీణిత సర్వదేవఋషి హృత్పద్మాసనాసీన గీ
ర్వాణీ ! ఆత్మ భవాననోజ్జ్వలిత శశ్వన్నాద సంవాసినీ
వాణీ ! వాగ్భవ కూట కోటిమధురస్పందప్రియం భావినీ ! 35





నీవా ! నీవు ! జగద్గురూత్తములు ధ్యానింపంగ శ్రీ శంకరుల్
దేవీ ఎక్కడ లేని దేవతవు సందీపించి నావాత్మలో
శ్రీవిద్యానిధి వైతి పెన్నిధివిగా శంగేరి పీఠమ్ములో
ప్రావిర్భావము నందినావు ధర నీరాకన్ వెలుంగున్ గనెన్ ! 36

పొంగుల్ వాఱెడి క్షీరవార్థి తరగన్ పొల్పారు శ్రీదేవివో !
రంగచ్చక్ర కళాంతరంగమున విభ్రాజిల్లు శ్రీ విద్యవో !
శృంగారాకృతి వర్ణకోటి తనువల్లిన్ దోచు శ్రీ మాతవో !
రంగారన్ ననుఁబ్రోచు శృంగగిరి తీర్థస్ఫారదా ! శారదా ! 37

మణిమాలా స్ఫటికాక్షశోభిత కరా ! మంజు స్వరాలాప స
ద్గుణ వాణీ శుకపాణి ! పుస్తక కళాగుప్తార్థ హస్తా ! జగ
జ్జన శ్రేయోభయదాయి శంఖశ్రితహస్తా ! హస్తముల్ నాల్గిటన్
నను దీవింపవె శారదాజనని ! విజ్ఞానార్థ సంధాయినీ ! 38

నాసాలంకృత తారకాద్యుతి జితానర్ఘ ప్రభా భూషణా !
నీ సౌందర్యము నూత్న చంపక సుమానీకమ్ము వాసించు నీ
నాసా దండము సామ్యమున్ గని ఘనానందాను మోదమ్ముతో -
నీసాన్నిధ్యము జన్మవాసనల మన్నించున్ గదా శారదా ! 39

ముఖలక్ష్మీపరివాహ చంచల చలన్ముగ్ధాక్షులన్ మీనముల్
సఖులౌచున్ జలకమ్ములాడు చెలువున్ సానందియై చూచి స
మ్ముఖమందున్ శశిమౌళి సృష్టి సకలంబున్ తద్గణేశాది నీ
ముఖమందున్ ప్రతి బింబితంబగుట సమ్మోదించునో శాంభవీ ! 40

ఇనబింబంబును నిందుబింబమును నీకింపార తాటంక శో
భనుఁ జేకూర్ప, కదంబమంజరులు నొప్పన్‌కర్ణపూరమ్ములై
ఘనధమ్మిల్లము దిక్కులన్ బఱగి ఆకాశాభమౌనీదు మో
మున శబ్దించెడి బ్రహ్మమెంచి ప్రణుతింతున్ చిత్కళాశాలినీ! 41

వదనంబేస్మరమంగళాయతనమై వక్రించు భ్రూవల్లరిన్
పాదలన్ తోరణశోభ నిన్నుగని సంపూర్ణాను రాగమ్ముతో
మెదలన్‌ఁ జంద్రకళాధరుండు జగతిన్ మీనాంకు సంజీవనం
బదియే యంచు స్మరించి మ్రొక్కెదను అంబా! నీదుకారుణ్యమున్ 42

నిద్ధంపున్ ఛవి నీకపోలములు మించెన్ పద్మ రాగమ్ములన్
ముద్దారంగ జగత్త్రయమ్మరుణ కాంతుల్ పండగాఁజేసె, నీ
వద్దంబై ప్రతిబింబితంబగు జగంబందున్ సమప్రీతి నీ
యొద్దన్ ప్రేమలు చూఱలాడు రసికుండోమున్ మమున్ హ్రీమతీ! 43

బిడ్డల్ తల్లులనంటి పెట్టుకొని సంప్రీతిన్ చరింపంగ నే
యడ్డున్ జెప్పఁగ లేని తండ్రి సుదతీవ్యాసక్త చిత్తంబు నం
దుడ్డీనంబగు ప్రేమవార్ధి కళలు ప్పొంగన్ శిరంబందొకం
డిడ్డన్ చంద్రకళామతల్లి యది నీవే యందునే తల్లిరో! 44

పగడంబుల్ పదివేలు నీ పెదవికిన్ పాటింపగా సాటి రా
విగురొత్తింపవు స్వామి చిత్తమును తల్లీ! పక్వబింబంబులం
దగు పింపంగను రాదు తాదృశ రస వ్యాసక్తి శ్రీ చంద్ర చూ
డ గుణ స్పందిత రాగరక్తిమము జాడల్ జూడ మన్యంబులన్! 45





తల్లీ! నీకనులందు తేజములు చంద్ర శ్రీకముల్ సూర్య కాం
త్యుల్లా సమ్ములు నగ్నికల్పములు నెందున్ సందుబోనీక నీ
వెల్లన్ కాలము మమ్ముకాచు కొనెదే! యేతేజ మేవేళ మా
కుల్లాసమ్మగు నట్టి తేజమున మమ్మోతల్లి! కాపాడుదే! 46

వెలుగుల్ నీకను చూపులై జనని నీవీక్షింప కున్నట్టి యే
నలుసైనన్ జగమందు నుండునె! జగన్న్యాయంబదేమో! ఒకం
డలుచై పోవును ధర్మబద్ధుఁడును; హీనాత్ముండు వేఱొక్కడెం
దులకో అందలమెక్కు, నీయెడల భక్తుల్ ముక్తులై పోవరే! 47

పదమాహంసయటన్న పాదముల సంభావింతు నమ్మా! కృపా
స్పదముల్ నీదు నపాంగ వీక్షణములే పక్షమ్ములై హంస హృ
ద్పదమందున్ విహరింప మానసము శర్వాణీ! శివానంద సం
పద రాజిల్లును గాదె మామక తపః పాక ప్రసారాకృతీ! 48

ద్విజపంక్తిద్వయ శోభితాననము శ్రీ విద్యాంకురస్థానమై
సృజియించున్ శతకోటి మాన్మథ ధను శ్శ్రీఖండముల్, వాఙ్మయ
స్రజముల్ పద్మ భవాంతరాత్మ కలికా సర్వస్వముల్ కోటి జ
న్మజ దుఃఖాపహముల్ శరణ్యులకు నమ్మా! నన్‌కటాక్షింపవే! 49

మృగనాభిన్ తిలకమ్ముఁ దీర్చి ముఖలక్ష్మీ వైభవమ్మిమ్ముగా
సొగసుల్ గుల్కెడు నిన్నుగాంచి శశి మించున్ వేడ్క ఏమచ్చనో
తగనిల్పెన్ తన బింబమందు నది విద్వత్కీర్తనీయమ్ముగా
జగమెల్లన్ స్తవనీయమయ్యె గదవే సౌందర్య శోభాధునీ! 50

మృగమద సౌరభంబునకు మిక్కిలియై ఘన సార సాంద్రతన్
ద్విగుణిత వైభవంబుగని వీచిన నీకపురంపు వీడియ
మ్ముగమగమల్ దిగంతరము పుక్కిట బట్టిన వమ్మ ! నీకుగా
జగములు మూగి వచ్చినవి సౌరభ వీచికలన్ సుమాంజలిన్ ! 51

నీ సల్లాపములన్ సుధామధురతల్ నిండార పొంగార వా
ణీ సంచారిత కచ్ఛపీ శ్రుతుల మన్నింపంగ లేమైతి మే
మా సాముల్ తలదాల్చు చంద్రకళ సంపన్నత్వమే పాటిదౌ
నీ సింగారపు మందహాసమెదలో నిండారముంచెత్తగన్ 52

నయనంబుల్ పొరుగింటి కర్ణముల చెంతన్ సత్కవీశాన వా
జ్మయగాథా శ్రవణమ్ము చూఱగొని స్ఫారమ్ములై నిత్య వి
స్మయ శోభన్ గనం జూచి యెఱ్ఱవడె నీర్ష్యన్నీదు ఫాలమ్మునన్
నయనం బంచుల నల్లనై యదియు నందంబాయె నీమోమునన్ ! 53

''నా సౌందర్యముం జూపుదర్పణము కాంతానీదు నెమ్మోము నే
దీ సారింపు'' మటంచు నెట్టి చుబుకంబీశుండు ముగ్ధంబుగా
కైసేతన్ మునివేళ్ళ బూనె నదియే కల్హార నాళమ్ముగా
నీ సిద్ధానన పద్మమున్ నిలిపె తన్వీ ! సాటి లేకుండగన్. 54

శృంగారార్ద్రరసాంతరంగమున నాశ్లేషించు స్వామిన్ రసో
త్తుంగ శ్రీ కమనీయ వక్షమున నస్తోక ప్రతిస్పంద స
ర్వాంగీణున్ బొనరించు తావక ప్రియ వ్యాసంగముల్ తల్లి ! మ
మ్ముం గీర్వాణ గిరాంధురంధరులుగాఁ బొల్పారగాఁ జేయుతన్ ! 55





ఏ భంగిన్ స్తుతియింపగాఁ దగునొ తల్లీ ! నిన్ననే నెంచ లే
నే భావంబులు నీవు నా పలుకులో నేరీతి పల్కింతువో !
ఆ భావంబుల నట్లె పల్కెదను యంత్రాధీనుఁడైనట్లు త
ల్లీ ! భద్రంబుగ నొడ్డుఁ జేర్పఁగదవే ! యేదోషముల్ గూర్పకే ! 56

అమ్మా ! నాకను చూపుమేర కనరా వా గద్యమీ పద్య పా
దమ్ముల్ నూపురశింజితమ్ములను చెంతన్ విన్పినట్లౌను వే
దమ్ముల్ సస్వరముల్ వినంబడిన చందంబెంతు వీణానినా
దమ్ముల్ పోలిక గొప్ప చెప్పి కొనుదున్ తల్లీ ! ప్రతారించకే ! 57

నాకా ? నీవు కనంబడందగిన పుణ్యంబా ! యశంబా ! మదం
బా ! కావ్యాలపనమ్ము భావనము నున్మాదంబ ! యోగీంద్రులున్
నీకై యెంత తపించియున్ గను గొనన్ నేఱంగలేరన్న నే
వోకల్పించిన నాల్గు పద్యముల నీవో నాకు కన్పించుటల్ ! ! 58

తల్లీ ! నీ దయలేకయున్న నొకపద్యంబైన శోభిల్లునే !
తల్లీలాకృతి నిద్దలంపగ మదిన్ దర్పించి పద్యంబులన్
వల్లింతున్ మరినేనె కర్తగ అహంభావమ్ముతో నందుకా
తల్లీ ! దవ్వులనుండు దప్పుడపుడున్ తన్మాత్ర శిక్షా స్మృతిన్ ! 59

స్వప్న జ్మ్మార్భుడ నిన్నుఁ జూడగలనా ? బ్రాహ్మీముహూర్తమ్ములన్
స్వప్నం బందునైన నిన్ను గనుటే సాధ్యంబు కాదాయె దు
స్స్వప్న ధ్వంసమునైన సేయువు గదంబా ! బ్రహ్మబంధుండ నన్
క్షిప్నుత్వంబున నీసడించెదవొ సాక్షీభూత చైతన్యమా ! 60

ఆచారాదిక నిష్ఠ పోయినది విద్యాసక్తియున్ లేదు నా
లోచింపంగను భావనా పటిమయున్ లుప్తంబె పూజాది కం
బా చేయంగను బుద్ధిపుట్ట దుపవాసాది శ్రమంబోర్వలే
మేచాయన్ కరుణింతువమ్మ మము దేవీ! సత్పథ భ్రష్టులన్! 61

కవిభావంబున నీదు రూపమును సంకల్పించుటే గాని నీ
యవికారంబగు రూపమిట్టిదని ఏరైనం గనం గల్గిరే!
అవిచార స్పృహణీయమైన భవదీయాకారమున్ మాదు మా
నవ ధర్మంబున నూహసేసి నిను కన్నామంచు నెట్లందుమో! 62

శివుడున్ శక్తియు కాముఁడున్ క్షితియు, వాసిన్ సూర్యుడున్ చంద్రుడున్
పువువిల్తుండును హంసశక్తులు పరాపుష్పాప్త్ర దేవేంద్రులున్
ప్రవిభాగమ్మున మూటికిన్ కొసలలో రంజిల్లు హృల్లేఖలన్
భవదీయమ్మగు మంత్రమూర్తు..ు సంభావించెదన్ శాంభవీ! 63

అమ్మా! శారద! పద్మజాసను సతీ! ఆనందవల్లీ ప్రసూ
నమ్మా! చిద్గగనంపుత్రోవలను చంద్ర జ్యోత్స్నలో ముంపవే!
అమ్మా! మంత్రమొ తంత్రమో జపమొ నాకావంతయున్ నిష్ఠలే
దమ్మా! తల్లివటంచు నమ్మితిని నీవన్నన్ కటాక్షింపవే! 64

పిలిచిన పల్కు తల్లి నిను పిల్వని దోసము నాది కాని నీ
వలనను కాదు నిన్ను మది పట్టిన పట్టుగ నిల్పుకోని నా
యలసత నాది కాని నను నాదు కనంగను రాని దెప్పుడ
మ్మ లలిత! యెట్టివాడయిన మన్నన సేయదె తల్లి బిడ్డనిన్! 65





నిన్నున్ గూర్చి భవాని దాసుడననన్‌బో నీదు సాయుజ్య మం
దున్నిల్పంగను జేయు దేరినయినన్ తోడ్తో తిజన్తమ్ముగా
నన్నాడంచును పుత్రవత్సలతమై! నంబా! జపంబున్ తపం
బున్నా జల్పము శిల్ప మెల్లను భవంబున్ దాటగా ఁగాదటే! 66

అరుణసువర్ణ కాంతి కలితాకృతి సత్కరుణా తరంగితాం
తరహృదయామృతాబ్ధియగు తల్లిని నిన్నుఁ దలంచి నంతనె
వ్వరికి విరించి ప్రేయసి విపంచి రవమ్ముగ వాక్ప్రపంచమున్
సరసత కల్గకుండు నిల సజ్జన గోష్ఠికి రంజనమ్ముగన్ 67

చెప్పినవే మరిన్ మరియు చెప్పుచు స్వామి కథానురక్తి కెం
పొప్పిన యట్టి నాల్కపయి నుండిన వాణి మెయిన్ సితచ్ఛవిన్
గప్పినదౌ జపాకుసుమకాంతికి వందన మాచరింతు నే
నప్పరమేష్ఠి ప్రేయసికి నచ్చిన ఎఱ్ఱని భాగ్యరేఖకున్! 68

నలుదిక్కుల్ కడు చిమ్మ చీకటుల ముద్గన్ నీదు ధమ్మిల్ల మిం
పులు దళ్కొత్తగ తారకా నివహమొప్పున్; నీదు నెమ్మోము వె
న్నెలలన్ చంద్ర కళల్ పదారు విరియున్ నిర్వ్యాజ చాంద్రీ స్రవం
తుల నోలాడు రస ప్రపంచములు బిందుస్పందనానందముల్! 69

సంధ్యావేళల నాకసమ్ము భువియున్ సంద్రమ్ము రోదోంతరం
బుంధ్యానమ్మున నీ స్వరూపములుగా ముక్తా ప్రవాళాచ్ఛ కాం
తిం ధ్యేయాకృతి హేమనీల ధవళోద్దీప్తిన్ ప్రపంచింపగా
సంధ్యావందన తృప్తి నిత్తుగదవే సావిత్రి గాయత్రివై 70

ప్రాతర్వేళ సమీర బాలకుల సేవల్ ముచ్చటల్ గొల్వగా
చేతః ప్రీతి కటాక్ష మాలికల నిక్షేపించుమున్ పూర్వ సం
ధ్యాతారుణ్య నవోదితార్క కిరణో ద్యత్కాంతి సర్వారుణా
బ్జాత శ్రీకదరస్మితాస్యయగు నంబన్ గొల్తు శ్రీ శారదన్ ! 71

ప్రాతఃకాల తుషార సంహతులలో ప్రాచీ నవార్కారుణ
జ్యోతిస్సుల్ ప్రతిబింబితమ్ములయి తోచున్ వేలకున్ వేలు శ్రీ
మాతా ! నీ చరణాంబు జాతములు - నా మాత్రంపు సామ్యమ్ముతో
నే తృప్తిన్ గని పూజ చేసికొన నీవే తల్లి మన్నింపవే ! 72

ఒక సంగీత రసప్రవాహమున నిన్నూహింతు నానంద చం
ద్రికలన్ సాధు సుధా స్రవంతికవుగా, దీపించు వాగర్థ భా
వుక సాహిత్య రస ప్రపంచమున నిన్నూహింతు నానంద వ
ల్లి కొసన్ పూచిన వేయి రేకుల పువున్ లీనాంత రామోదమున్ ! 73

బాలారూపిణిగా కుమారికవుగా ప్రాయంపు కళ్యాణిగా
వాలాయమ్ముగ నామనంబున పరాపశ్యన్తికా మధ్యమా
లీలన్ దోచిన నీవె స్వామి తలపై లీలావతంసమ్ముగా
బాలేందుద్యుతి నొప్పియుంటివని సంభావింతు నీ వైఖరిన్ ! 74

నన్నున్ మేల్కొలు పంగఁ జూచెదు నిశిన్ నా పద్య పాదాలతో
వెన్నున్ దట్టుచు పల్కరించెదవు సంప్రీతిన్ వినూత్నమ్ములె
న్నెన్నో యూహలు రేపు చుండెదవు తల్లీ ! నా కవిత్వమ్ము నం
దున్నైశో రమణీయ మార్గ మిది యందున్ సుప్రభాతమ్ములన్ 75





నీకున్ నచ్చిన పద్యముల్ స్ఫురణలో నిల్పంగ నీ రాత్రులన్
నాకున్ మేల్కొలు పైనరీతి చెవిలోనన్ పల్కుచున్నావటం
చేకాగ్రమ్ముగ విన్చు నీ కొఱకుగా నేనెంత ధ్యానించినన్
రాకాపూర్ణశశాంక రమ్యముఖ మారాధింపగా తోచదే ! 76

నీవె మనస్సు, వ్యోమమును నీవె మరుత్తు మరుత్సఖుండు నీ
వే వివరింపగా జలము నీవె ధరిత్రియు నీవె అన్ని నీ
వై విలయమ్మునన్ మిగులు నట్టిది యన్యములేక నిన్ను నీ
వే వహియింతు ధాత్రు యువతీ చిదచిత్ర్వమదాకృతీ సతీ ! 77

ఇనుడున్ చంద్రుఁ డురోజ యుగ్మమనగానే పారుచున్నట్టి యీ
శుని దేహమ్మవు నీదు నాత్మకును నీశుండే శరీరమ్ముగా
వున శేషమ్మును శేషియిర్వురొకటై యున్నట్లె రూపించి రా
యనఘుల్ శంకరులా జగద్గురు లదే యానందమందింపవే ! 78

తల్లీ ! నీవును నా పరాత్పరుడు తాదాత్మ్యమ్మునంబొల్చు తా
వుల్లీలామయ కేళికా కమల సంఫుల్లమ్ములుల్లమ్మునన్
దెల్లంబౌనటు దారి జూపితి కళల్ దీపింపగాఁ జేసి వా
గ్వల్లిన్ నాదము నింపి బిందుమయ చక్రవ్యూహమున్ దెల్పవే ! 79

కోటి రవీందు తేజములు గోటికి రాని మహోజ్జ్వలుండు ము
క్కోటి సురల్ కనుంగొనుటకున్ వలనొప్పనివాడు నీదు లా
లాటికుడైనవాడు సకలంబగులోకము నందు చిత్కళన్
దూటి యెసంగు వానిఁ గొలుతున్ భ్రుకుటీ కుటిలోని ధూర్జటిన్ ! 80

చీకటి కోణమద్ది బహుచిత్ర మణిస్ఫుట భూషణద్యుతుల్
ప్రాకట మింద్రచాపముగఁ బర్వగ నొక్కతటిల్లతాంగి శ్యా
మాకృతియైన యొక్క ఘనునంటి మెఱుంగులు గ్రుమ్మరింప ము
ల్లోకము తాపమున్ జడులలో శమియింపగఁ జేసెనాతడున్ । 81

అది మణిపూరమా ! వెలుగులన్నియు నీదు విభూషణాళిచే
పొదలినవా ! మహేంద్ర ధనువున్ పరికల్పిత మైనదా అహో !
విదితము చీకటుల్ దొలచు వెల్గులు నీదు తటిద్విలాసముల్ 82
చిదిమిన శ్యామలాంగుమెయి చిందిన వర్షము శాంతి ధాత్రికిన్ ।

తిమిరో ద్భేదిని నీదు శక్తి కలితోద్దీప్తిన్ తటిద్వస్తమై
అమలానేక విభూషణాంచిత రుచిన్ వ్యక్తేంద్ర కోదండవి
భ్రమ మొప్పున్ మణిపూరమే శరణమై వర్షించు నా శ్యామ మే
ఘముగొల్తున్ హరభానుతప్తత్రిజగత్ శాంతి ప్రదమ్మున్ సదా । 83

ధాత్రిన్ వీడి జలమ్ము దాటి యనల స్థానమ్ము పై బ్రాకి వా
తత్రాణంబున పొంగి శీఘ్రగతి నధ్యాసించి యాకాశమున్
భ్రూత్రై కూటము పైన మానసగతిన్ బోఁబో సహస్రారమౌ 84
యాత్రాయోగము నీకటాక్ష ఫలమంబా సచ్చిదానందదా !

దేహంబన్న మహేంద్రియాఢ్యముగిరిన్ ధిక్కారతన్ మట్టి సం
దేహంబన్నది లేక యాత్మగతి సందీపించు యానమ్మునన్
సోహంభావన మన్మనః కపిని దాసోహమ్మనన్ బట్టితిన్
నీహారాంశు కళా వతంసితశిఖా ! నీ చేతి కందించితిన్ । 85





పదిలముగాగ గమ్యమునుఁ బట్టుట పుట్టువులెన్ని పెట్టగున్
పదములు ఛందమందునను బట్టితి వర్ణము లెల్ల పూలుగా
పది పది విద్యలన్ జదివి పట్టితి ముద్రలు చేతనైన య
ట్లిది యిధి యంచు చెప్పి నను నింటికి గొంచును బోవె తల్లి రో ।86

పెడత్రోవన్ బడి పోక కాచుకొనవే విద్యా వివేకమ్ములన్
తడబాటున్ గననీయకే జనని ! నీ దారిన్ ననున్ గొంచుఁబో
యెడమైనన్ మరియెన్ని జన్మలగునో ! ఈ జన్మలో నీదు వెం
బడి నే నుండుట నీ కటాక్షమదినన్ పాలించుటన్ గాదటే । 87

అది యమృతాబ్ధి చుట్టువలయమ్ముగ దైవత పారిజాతముల్
అదిమణి దీవి నీపవనమయ్యది చింతిత రత్నగేహమ
య్యది శివరూప మంచమదె యంబ సదాశివునంక సీమ పై
నది గదిగో యటంచు మదినారటమందుట స్వప్న లీలయా ! 88

పోయిన యంత దూరమును పోయి రహస్యము గాన లేక ఆ
పోయిన దారినే మరల భూమికి పుట్టకుఁ జేరు పామునై
పోయితి చుట్ట చుట్టుకొని పొక్కుచునుంటిని నిద్రవుచ్చకే
మాయను ముంచకే తెలివి మాలగ జేయకువే ! కృపామయీ ! 89

గంగాస్నానము కాశి కాపురము శ్రీ కంఠాభిషేక క్రియా
సాంగోపాంగ కలాప తత్పరతయున్ సంధ్యాసమర్చా పర
త్వాంగీకారములేని జన్మముల చేతన్ జన్మముల్ గాంచి జ
న్మంగాంచన్ మరి నిన్ను గొల్చి యిహ జన్మంబుందునన్ శారదా ! 90

శృంగం బారగనంటి భక్తిపదముల్ జేకొంటి ముక్కంటి యు
ర్ధాంగిన్ గంటిని లోకమాతను జగద్రక్షన్ గనుంగొంటి సా
క్షింగంటిన్ శశిఖండ మౌళిని రసస్విన్నాంగు శృంగేరి లో
నం గంగాంబు తరంగభద్రములు తుంగాంబుల్ ప్రసేకింపగన్ ! 91

ఒక బాలామణి శ్రీకుమారిక వనీ వ్యూహమ్మునన్ శ్రీకళా
త్మిక బాలేందు సమార్ద్ర రేఖయనగా దీపించెనేగాని శీ
ర్షక మట్టుల్ తలదాల్చు వైఖరిని కళ్యాణాత్మగా చేతికం
దక పోయెన్ శివ ! నీదు కొప్పువయి నందంబెల్ల తానై ప్రభూ ! 92

శుద్ధస్ఫాటిక రత్నకాంతియుతుడై శోభిల్లు నాకాశత
త్త్వోద్ధారుండగు స్వామితో సమముగా నొప్పారు దేవిన్ మన
స్సిద్ధిన్ గోరి విశుద్ధినంది మనసా సేవింతు చంద్రాంశు సం
శు ద్ధంబౌ నుభయ ప్రభాసరణి గాంతున్ నేన్ చకోరిస్థితిన్ ! 93

భూమీజమ్ములమధ్య భూమిజముగా భూపుత్రికా నాథు ను
ద్దామధ్యాన గరిష్ఠతన్ హృది నిధిధ్యాసింప సమ్మోహన
మ్మై మారున్ గడుపార గన్న యొక రామాకారమే తోచి శ్రీ
రామా రామయటంచు గంటి లలితా రాజీవ పత్రాక్షినిన్ ! 94

మత్స్యాకారముగాగ నాతనువు సంభాళించి యోగమ్మునన్
మత్స్యమ్మై ఘన వార్ధితేలిన ప్రభున్ భావింప శ్రీనాథునిన్
మత్స్యమ్ముల్ నయనాంతకాంతి కలనన్ దార్కొన్న మీనాక్షియే
మత్స్యమ్మట్టుల నన్భవాబ్ధి తరియింపన్ జేయగాఁ జూచెడిన్ 95





ఒక్కొక పద్యమున్ తఱుముచున్నది ఊహలతోడ నన్ను నీ
దిక్కుగ నీవె దిక్కుగ నదీన నవీన కవీన మార్గమున్
వాక్కలహంసయానమున పట్టగ జేయుచు నున్నదమ్మ నీ
వెక్కడ నుంటివో పదము లిట్టుల నాకు నను్రగహించెదో ! 96

గొప్పలు చెప్పికొంటి ననుకోరు గదా ! జననీ ! జనమ్ము నా
త్రిప్పలు వారికే మెఱుక ? తిన్నగ నిద్దుర పట్టువేళ నీ
వప్పటి కప్పుడే పదము అంటి మనమ్మునుఁ దట్టి పాదముల్
చప్పుడు లేక నీనడక సాగగఁ జేయుదు మేలుకొల్పుగా ! 97

మృదువౌ వైఖరి నిన్ స్తుతించుటయె సామీచీన్యమంచెంచియున్
పదముల్ గైకొను వేళ నే హిమగిరి ప్రాంతీయ కాఠిన్యమో
పాదలున్ వాక్కున, వింధ్య పర్వత గుహా ఫూత్కారముల్ పల్కు నా
యెదలో ! ఏగిరి కాననాంతరము లందే రీతి నేమాడునో ! 98

మగపిల్లల్ వదిలో సగమ్మొకతె అమ్మాయిన్ కుటుంబమ్ము పెం
పుగ సాగెన్ బ్రతుకెల్ల సప్తగిరులన్ పాల్పారు దైవమ్ము నీ
వుగ బాలాత్రిపురేశ్వరీ ! పసితనంపున్ భారముల్ తీరె శృం
గగిరీశార్ధతనూవిలాసిని ననున్ కాపాడు మీ వృద్ధతన్ 99

పిల్లల్ దైవ సమానులంచు పెనుపన్ పెద్దై మనం బారగా
తల్లిన్ దండ్రిని వారు దైవములుగా ధ్యానించుటల్ ప్రీతిగా
చెల్లెన్ మాకు సుఖావహమ్మగుచు మాచిన్నారులన్ బ్రోవవే
తల్లీ ! శంకర సంప్రదాయగురు తాత్పర్యమ్ము పెంపొందగన్ ! 100

అంత విశాల దృష్టిగల అమ్మకు నేమి కొఱంత నీకు ర
వ్వంత కటాక్షమున్ బఱపి నంతట దవ్వుల నున్న వీడు తా
నెంతటి ధన్యుడౌను ! మరియెంతగ మేడల వెల్గు చుండునో
అంతగ పూరిపాకల హిమాంశుడు వెల్గును చిమ్మకుండునే ! 101

వర్ణములా సువర్ణములు పాదములా కలహంసముల్ స్తుతుల్
కర్ణరసాయనమ్ములు శుకమ్ముల పల్కులు పల్కులమ్మ ఆ
కర్ణ విశాలనేత్రములు కంజదళాయతముల్ సుధార్ణ వో
దీర్ణ తరంగ మాలికల తేలిన వెన్నలు నీ ప్రసన్నతల్ 102

నాదానందము నీ పదంబులను గన్నానంచు నుప్పొంగెదన్
వేదంబుల్ వినవచ్చు వేళ - కవితా విద్యున్ ప్రపంచించె నా
నాదంబేయనిపించె రామకథలోనన్ మౌని వాల్మీకి, ఆ
మోదంబందెను త్యాగరాజు ప్రణవమ్మున్ జేసి సంగీతమున్ 103

మత్తేభంబులపైన నిల్పుకొని అంబా ! వాక్కు అంబారిగా
చిత్తంబారగ నూరనూర జనముల్ సేవింప నీ పాదముల్
గుత్తుల్ గుత్తులు చంపకోత్పలములన్ గూర్తున్ మరిన్ మాలలన్
సత్తేజంబున బ్రోవవే రసమయీ ! శార్దూల భద్రాసనా ! 104

ఆడినదెల్ల యాటగను అన్నవి యెల్లను నన్నయట్లుగా
పాడిన దెల్ల పాటగను భాసిలజేసితి వమ్మనీ కృపా
క్రీడితమైన జీవితము కేవలమున్ రసవంత మౌనటుల్
షోడశముల్ కళల్ నెఱపుచున్ ఫలియింపగ జేయు మమ్మరో 105





మ్రోగని వీణగా బ్రతుకు మోయుట కెన్నియొ జన్మలెత్తగా
మ్రోగిన వీణగా బ్రతుకు మోయుట కెత్తెడు జన్మలేనటుల్
రాగము తోడ నా బ్రతుకు రాయిడి దీర్చితి, నాదు దేహమున్
తీగలు లేని వీణియను నిల్పవె నీ శ్రుతిలోన శారదా ! 106

శారద పద్మసంభవుడు; శాంభవి చంద్రకళాధరుండు; త
ల్లీ ! రమయున్ రమాధవుడు చేరి ననున్ బ్రతికించిమేని సొం
పారయపెంచి నా మనము నందు రమించుచు నుండు జంటలై
వారును వారు వారు సరి వారలు నన్నుఁదరింపఁ జేయరే 107

వారలు ముప్పురున్ గలసి వర్థిలజేయుచునున్న జీవునిన్
వారలె యే సహస్రదళ పద్మము నందునొఁజేర్చకుందురా
వారికృపా కటాక్షముల పట్టిన పట్టులలో సుషుమ్నకున్
దారియు చిక్కకుండునె సుధామయ సింధువు జేరువేళకున్ 108

రాముని జన్మయజ్ఞమును రాజిలఁజేసిన శృంగమౌని యే
నా మనమందు రామమయ నాదము ఘూర్ణిల జేయునేమొ ! ఈ
నా మననమ్ముసర్వము ననాహతమై మణిపూరమందు సౌ
దామని శ్యామసుందరుని దర్శన భాగ్యఫలమ్ము గూర్పదే ! 109

రాజితలీల షోడశ కళాపరిపూర్ణుడు రామచంద్రుడే
భూజనితన్ విదేహ విభుపుత్రిని శ్రీమతిగా గ్రహింప తా
నై జనకుండొసంగు మణి యన్న వశిష్ఠుల వాక్కు విద్యగా
భ్రాజిల జేసికొన్న రఘురాము విశుద్ధిని ప్రస్తుతించెదన్ ! 110

కళ్యాణీ మధు రావలోకన రసజ్ఞంబౌ నయోధ్యాధిరాట్
బాల్య శ్రీక దృగంశు మాలికల శోభాఽ భోగవత్యంశువుల్
లౌల్యం బారనవంతికా లలిత లీలన్ గాంచు వైదేహి దృగ్
వల్ల్యానంద విలాసముల్ విజయముల్ కల్పించుతన్ శారదా! 111

శ్రీదేవీ పదవాచ్య వీవెకదవే శ్రీ చక్రమధ్యస్థితా!
నాదోపాస్యవు బ్రహ్మరూపిణివి నానారూప నామక్రియా
భేదంబుల్ జగమెల్ల మిథ్య కద! సంవిద్బిందు మూలమ్మునన్
భేదింపంగనులేని బ్రహ్మ మొకడే వేద్యంబగున్ శారదా! 112

పోయిన యంత దూరమును ౘబోవుచు క్రిందకు వచ్చుచుండు జీ
వాయత యానమందు నొక యంచున నే మెఱపో స్థిరమ్ముగా
నాయతనమ్ము జేర్ప సహయానము సేయదె శారదా మనో
జ్ఞాయత కచ్ఛపీశ్రుతుల చాయ లయింపదె బిందువందినన్! 113

వేయి దళాల పద్మమున బిందువునందు సుధాస్రవంతికా
స్నాయిగ నన్ను దీర్చునొక నాదము నా దహరమ్మునందునన్
సాయ మహర్నిశల్ నిలుపు చల్లని తల్లికి పాణిబూను వీ
ణా యత నాదవల్లికి ప్రణామ సహస్రము శారదాంబకున్! 114

గురువు కటాక్షమున్ బఱపు కోమల మౌ కృపచాలు జన్మకున్
బరువును దీర్ప, రాగరసవార్ధి తరంగితమైన యట్లుగా
సరస విక స్వర స్వర రసప్రసరమ్ముగ మన్మనో విపం
చి రణిత మాకృపా కలనఁ జేసితి వంచనిపించు శారదా! 115





కైతలుకావు నా మనసుగాంచిన వ్రాతలు నీదు చేతలై
నాతలపుల్ మలంచినవి నన్గదలించుచు నుంటి తల్లి! యీ
నా తను హృద్వచస్సులను నాదమయమ్ముగఁ జేయవే విపం
చీతత తాళ సంగతుల చిందెడు సత్కృపతోడ శారదా! 116

అది శృంగేరి వనాంతరాంతర రహస్యాఖ్యానమై శారదా
సుదతీ వ్యాహృతిగా మనోంబుజమునన్ శోభిల్లు వాగ్వల్లరిన్
చదువుల్ పట్టు వడంగ బ్రహ్మపదమున్ సాధింపగా నేరమే!
సదయ స్పందిత కచ్ఛపీశ్రుతి సుధా సంచారిణీ! భామినీ! 117

మణులన్ గట్టిన మెట్లపై పలుకు నీ మాణిక్య వీణారవం
బణువైనన్ మహతో మహీయ మగుచున్ వ్యాసక్తిమై మన్మనోం
గణము ప్రాంగగ జేయుగావుత చిదానందాను సంధా తరం
గిణులన్ నాద సుధాస్రవంతికల భంగిన్ సారదా! శారదా! 118

అమృతంబున్ వహియించు పత్రములు పుష్పాదుల్ ఫలాదుల్ తరుల్
విమలంబౌవన దేవతా హృదయ ప్రహ్వీభూత బ్రహ్మోను భూ
తిమయంబుల్ గిరి శృంగదేశముల వర్తిల్లున్ మహర్షుల్ వలెన్
ప్రమదంబార ఫలాభి షేకములు సల్పున్ స్వామికిన్ శారదా! 119

రసముల్ గ్రోలి సహస్రశః కిరణ జాలంబుల్ ప్రసారించి సా
రస మిత్రుండు జగమ్ము వర్షముల హర్షమ్మున్ ఘటింపంగ భూ
మి సదా పండిన పంటగా పులకలన్ మిన్నంట నానందముల్
కొసలన్ పూచిన వల్లి వౌదు గదె మాకున్ తల్లివై శారదా! 120

కమలంబుల్ వికసించె పల్కె శుకముల్ గంధమ్ములన్ జిమ్మె పు
ష్పము లానందముతోడనాడె లతలున్ స్పందించె భూమీజముల్
సుమనో గీతిక లాలపించె పికముల్, శోభిల్లె నల్దిక్కులున్
ప్రమదించెన్ భువి భారతీ గురు పద ప్రాప్తిన్ సదా శారదా ! 121

నవహరి ణావనంబున మనమ్ము రమించెడి స్వామి కన్నులం
దవగతమై కృపా గరిమ మబ్బుర పాటున చేరడేసి క
న్గవల తళుక్కునన్ మెఱయుకాంతుల నా హరిణమ్ము లాత్మలుం
కువలుగ స్వామికిన్ నెఱపు కోమలముల్ పరిచర్య లెంచెదన్ ! 122

అది హరిణీ వనంబని మహత్తరమిద్ది వనస్పతి గంధ మం
చెద పదిలమ్ముగా నివటి ఈ మృదులానిలముల్ రసోదయా
స్పదములటంచు నీ ప్రకృతి చాయల గుండియపండు నంచహో
సదయ విలోకన ప్రభల సమ్మతి దెల్పెడు స్వామినెంచెదన్ ! 123

మృదుపవనాంకురమ్ములను మెత్తని పల్లవ సంపుటిన్ వనీ
మదవతి నూత్న నూత్న సుమమంజరులన్ కుసుమాభిషేకముల్
పాదలగ స్వామి పాదముల పొంతల సేయు సపర్య లెంచెదన్
ముదమున శారదన్ పరమపూరుషడర్చన సేయ బోవగన్ ! 124

స్వామి వనీ విహారమును సల్పగ జూచెడు భాగ్యమెట్టిదో
నామనసారగంటిని ఘన ప్రమదంబున శారదాంబ పూ
జా మహితోత్సవంబునకు స్వాముల వారలు పాదచారులై
ధామము నుండి వెల్వడిన దారులలో నయనోత్సవంబుగన్ ! 125



హరిణంబుల్ తన నేత్రముల్ గనుచు బ్రహ్మానంద మందంగ నా
హరిణీ నేత్రములందు శారద మనోహ్లాదమ్ము గన్గొంచు బ్ర
హ్మ రసానందమునన్ చతుర్ముఖము లందాత్మాను సంధాన సుం
దర చంద్రాంశు లనుగ్రహింప నెదలో ధ్యానింతు నా దంపతిన్ ! 126

రూపము లేని నీకు నొక రూపము నామము లేని నీకు నా
రూపము తోడి నామము నిరూపణ జేయుటెగాని బ్రహ్మ నీ
రూపము, పేర్కొనంగను నిరూపణ సేయగ బ్రహ్మమొక్కడే
రూపము తోడనుండిన నిరూపిత బ్రహ్మము నీవె శారదా ! 127

తలపై నగ్నిని, సూర్య చంద్రులను నేత్ర ద్వంద్వమందున్, దిశల్
కలయన్ శ్రోత్రములందు, వేదములు వాగ్వ్యాపారమందున్, హృదిన్
వెలయన్ విశ్వము, ప్రాణమై యనిలమున్, పృథ్విన్ పదాబ్జమ్ములై
తెలియన్ నేరము సర్వభూతములలో దీపించు నా బ్రహ్మమున్ !128

స్వాత్మానందమునన్ లవమ్ములు గదా బ్రహ్మాది కానందముల్
స్వాత్మానంద మయ స్వరూపిణి ! నినున్ సర్వస్వమంచెంచినా
యాత్మన్ నిల్పికొనంగ వాఙ్మయ రసాద్యానంద మే పాటిదొ
నాత్మానందము కోసమే తలతునంబా ! శారదా ! ప్రోవవే ! 129

రాగము లేని నాదమున రంజిలగా వలె పండితుండు నా
యోగము లేని వాడు కవియో మరి గాయకుడో మరేమియౌ
నో గురుతింపలేము నది యూహకు నందని మౌన రాగ మా
భోగము లేని వారలకు పుట్టదు యోగమ దెన్నిజన్మలన్ ! 130

దయతోడన్ కడకంట నీవు కన చంద్రజ్యోత్స్న లోనన్ కళా
చయమున్ గాంచి వెలింగె నొక్కరుడు; నీచండ ప్రచండాంశు సం
చయమందున్ తపియించి యొక్కరుడు విశ్వం బెల్లవెల్గించు, నీ
మెయి వన్నెల్ తన జ్వాలలైయొకడు తన్పెన్ దివ్యులన్ తల్లిరో। 131

తన లీలన్ భువనో దయస్థితి లయత్వంబుల్ వినోదంబుగా
దనరన్ జేయు పరాత్పరుండ భవుడంతర్లీన శక్తిన్ విమ
ర్శను శోభిల్లు ప్రకాశమాత్ర తనుడౌ సర్వేశ్వరుండోముతన్
ఘనమౌ కామ కళా విలాసమయ విజ్ఞానమ్ముమనన్ శారదా। 132

శ్రీచక్ర స్థిత శారదా కృతిమయ స్పీతాత్మ భావమ్ము నా
లోచాంచల్యము బాపి నిశ్చలతమై రూపింపగా జేసె వి
ద్యా చైతన్యము లోక శంకరము శుద్ధా ద్వైత సిద్ధాంతమున్
ప్రాచీనార్ష మనః ప్రమాణితము సద్వ్యాఖ్యాన విఖ్యాతమున్। 133

అపరోక్షాను భవైక వేద్యమయి హృద్యంబై అజాండాది బ్ర
హ్మవదాధ్యాస గురు ప్రబోధపరమంబౌ దక్షిణామ్నాయ పీ
ఠపరి వ్రాజక హంసమున్ గొలుతు నిష్ఠన్ భారతీ తీర్థ పూ
జ్యపద శ్రీకము సర్వదాభినవ విద్యాతీర్థ సంజాతమున్। 134

పడగన్ విప్పిన భోగిరాజావలె శుంభద్వాగ్భవాబ్జాత మం
దుడు రాజోదయమున్ కలాస్ఫురణమై నుప్పొంగ గాఁ జేసిన
ల్గిడ చిర్నవ్వులు చంద్రికల్ దనుక ప్రజ్ఞన్ భారతీ వైభవం
బడరన్ తీర్థ మహస్సు గూర్పు గురు పాదాబ్జాతమున్ మ్రొక్కెదన్ 135





బైందవ మందునేకమయి బ్రహ్మము నందు త్రికోణ సంపుటిన్
జెందుచు, నష్టకోణమును జేరి, దశారము జంటనంటి పై
నంది చతుర్దశారమును నష్టదళమ్మును మించి షోడశం
బుందిలకించి వృత్తముల మూటిని చుట్టుచు భూపురత్రయం
బంది జగమ్ము కాచుకొను నంబకు మ్రొక్కెద శారదాంబకున్। 136

ముందుగ భూపురత్రయము ముట్టి త్రివృత్తము దాటి షోడశం
బుందరిసించి యష్టదళమున్ గమకించి చతుర్దశారమున్
జెంది దశారయుగ్మమును ఁజేరి శ్రమించుచు నష్టకోణమున్
జెంది త్రికోణ బిందువును జేరి లయింపగ నీవె శారదా। 137

హ్రీం హ్రీం హ్రీమ్మని నిన్ త్రికూటములలో నెవ్వేళసౌందర్య ల
హ్రీం హ్రీం కారరస స్వరూపిణిని సాహిత్యమ్మునన్ గొల్తు నా
హం హ్రీంకార సమాం పరాత్పరతరా మన్యాంతు జానే హి త
న్మాం హ్రీమంత మవేహి మాత రనిశం మాం పాహి, హే! శారదే! 138

పట్టక బ్రహ్మవాసన సుభాషిత మౌనె వచస్సు; నాదమున్
ముట్టక శబ్దమౌనె స్వరపుంజము; పట్టిన వీణ మీటకే
పుట్టునె రాగమోజనని! పున్నెము పండుటయేమొ! పద్మపున్
పుట్టువుతోడి నీయునికి పొంతలకై తపియింతు నమ్మరో! 139

భేదము లేని భక్తి నిను బిందువునన్ గొలుతున్ సరస్వతీ!
నాదకళావతీ! పదగణ స్వరరాగవతీ! సుధామతీ!
వేదవతీ! గిరాంసురగవీ! రసవత్కవిలోక భార్గవీ!
వాదన లేలనే శివశివాద్వయ భావద శారదా సతీ! 140

క్షణమున్ పుట్టుచు (బోవుచుంటి నిలువన్ శక్యంబు గాకుండ నీ
క్షణ సౌభాగ్యము నిత్యమంచు దలపన్ జాలన్ పరానందమే
యణువైనన్ మహతో మహీయ మగుచున్ యాథార్థ్యమై జీవితాం
గణమున్ దాటి శ్వసింతు ముక్తిమతినై కాపాడవే శారదా ! 141

బంధములందు జిక్కుకొని భామినిలో ప్రభవించినాడ కా
మాంధుడనై పదే పదిగ నార్గురు సంతతి పెంచికొంటి మో
హాంధత – వారి పుణ్యమున నంటియు నంటక యుంటి బంధ సం
బంధములందు – నీ పదము పట్టితి ముక్తిని గోరి శారదా ! 142

బంధములందు జిక్కియును వాఙ్మయ రూపిణివైన నీదయన్
గ్రంథములన్ శ్రుతిస్మృతుల గంటి యవిద్యనెటింగితిన్ సుధా
సింధువు జేరు మార్గమున శృంగ గిరీంద్రమునందు నావగా
సంధిలి నావు నీవు మరి జన్మము లేదని పించు శారదా ! 143

క్రిందటి జన్మలందయిన కేవల పున్నెము కారణమ్ముగా
నందితినేమొ పండితుల యన్వయమందున జన్మ, నీదయన్
ముందట నింక జన్మమును పొందనటంచనిపింపుమమ్మ ఆ
నందమయాంతరంగమున నాదము నీవయి యున్న శారదా ! 144

నా దైవంబును తల్లి దండ్రియును ఈ నా సద్గురూత్తం సమున్
వేదంబుల్ నిగమా గమంబులును సంవిద్బిందువున్ జ్ఞానమున్
నాదంబున్ కళలున్ సమస్తము తవాజ్ఞాచక్రమందున్ కనం
గాదారిన్ గొనివచ్చితే జనని శృంగ శ్రీకశైలావనిన్ ! 145

స్వామియను గ్రహించె మనసా వచసా రసవత్పరిష్క్రియా
భూమికయా, మదీయమగు బుద్ధి ప్రచోదన సేయు భర్గమా
ధామమునందు జన్మకును ధన్యత గూర్చెడు చూపు నిల్పె ప్ర
జ్ఞామతి భారతీ హృదయ గహ్వరమున్ తిలకింప జేయుమున్ । 146

గంగా స్నానము జన్మ తారణమనంగా నంత రంగమ్ము నా
గంగా జేసితి విశ్వనాథ హృదయాకాశార్ద్ర రంగమ్ములన్
తుంగాపానము శారదా మృత రసోత్తుంగ ప్రదంబన్న నిం
దుం గాఢంబగు భక్తి యుక్తి చులికింతున్ భారతీ తీర్థమున్ । 147

స్ఫటిక శిలాంతరంగమున పద్మమణిన్ గొని రత్నగర్భుడై
స్ఫుట ప్రణవ ప్రతిధ్వనుల పుక్కిట బట్టిన రాజతాచలో
త్కట తటచారి యొక్కడు జగద్గురు పూజలనందుకొంచు ని
చ్చటనె గజాస్యుడుండునట । చాలది బుద్ధికిసిద్ధి శారదా । 148

అజ్ఞాత విభ్రాంతి నరుదెంచు రాయంచ పద పరిజ్ఞాన సంపదగడింప.
అస్తినాస్తి వ్యాఖ్య కసదైన మధ్యంబు బ్రహ్మాండ తత్త్వమ్ము పరిఢవింప
ఆకుచాగ్ర స్ఫారహారాళి యూర్ధ్వోర్ధ్వ మార్గోపదేశ సంపత్తినింప
ఆ కర్ణ విస్తారితాక్షి సరోజంబు లంబుజాసను కల్మికంజలింప

ఔపనిషదమౌనాకార మమరి యమరి
స్వానుభవ రసానంద సంవాద గరిమ
వీణియన్ బూని నాదమ్ము వెలువరించు
నలువరాణి మదాత్మలో వెలయుగాత 149

వర వరాకోటి సంపన్నాను రాగమ్మ
సామ గానామృత సరణి నించి
సమయాను రూపపశ్యన్తీ విలాసమ్మ
యాజుషవ్యాజత నవధరించి
మధ్యమాసంయోగ మణితాభిలాషమ్మ
నాథర్వణస్ఫూర్తి ననువదించి
ప్రకటీ కృతాత్మీయ వైఖరీ చాటూక్తి
నవ్యాజ ఋగ్వీథి ననుగమించి

చతురుపాయ చతురుడౌచు సరసమతి మ
నోజ్ఞను వర్తన సుముఖుడౌనజాని మోము
దమ్ములనెపుడు భ్రమరీరుతమ్మునించు
వాణి పాలించుగాత మద్వాక్య సరణి 150

వేంకటేశ్వర పాదపంకజంబుల రక్తి
చిఱుత ప్రాయవుకైత చెప్పికొంటి
శ్రీరామ పాదాభిషేక క్రియాసక్తి
భాసనాటక మాంధ్ర భాషగంటి
ఘన కవి సమ్రాట్టు కల్పవృక్షచ్ఛాయ
గురువద్యవిద్యను గూర్చుకొంటి
కవి భూషణుండైన కన్నయ్య బాలకృ
ష్ణయ్య వంశంపు మర్యాదగంటి





రాగరసభావరమణీయ రాజ్యలక్ష్మి
కన్నతల్లిగా నీదయ గంటినమ్మ
భారతీతీర్థ సేవన ఫలము నిమ్మ
సరస కవితా గుణ కదంబ శారదాంబ।

పలుకు తోడైనావు పట్టైన సభలందు
నవధాన మలవోక నవదరింప
అఖిలాంధ్ర విఖ్యాతి కాస్పదం బైనావు
''మధురా విజయ'' కథా కథనమందు
త్రిపురా రహస్యాల దీపింప జేసితి
''కాదంబరీ రసజ్ఞత'' కు తోడు
విద్యాలయాధ్యక్ష విభవంబు నిడినావు
విజయనగర రాజ వీథులందు
శృంగగిరి భారతీ తీర్థ సేవనమున
శారదానందలహరి సాక్షాత్కరించి
జీవితంబును ఫలియింప జేయుమంబ
సరససారస్వత కదంబ శారదాంబ। 151

జంబేటి జంబాల జాలమ్మై పోయె సంసా
రంబు నీ కృపా సారగరిమ
మానావమానాల మనసంటకే పోయె
లోకంబు త్వత్కృపాలోక గరిమ

అడ్డదిడ్డంబైన వ్యసనాల బడదాయె
బ్రతుకెల్ల త్వత్కృపా పాంగగరిమ
గురుకటాక్షంబుల గురితప్ప నీదాయె
చదువుల నీకృపా స్వాదగరిమ

ఎంతలో నెంత యుండిన నంత తృప్తి
వింత వింతల కెగబ్రాకు చింత లేక
నీయపాంగ వీక్షణమె కాపాయె నంబ! 153
సరససారస్వత కదంబ శారదాంబ

శ్రీనాథు నర్చింతు చెలగి సువర్ణాల
పాదమంజీరాలు ప్రధ్వనించి
పోతన్న భావింతు పుత్తడి కరగించి
తేట తేనెల తెల్గు తీపి నించి
పెద్దన్న పూజింతు ప్రియమారగ శిరీష
కుసుమాల మాలలు గుస్తరించి
విశ్వనాథు నుతించి వెలయించెదను కైత
కిన్నెర మీటి సంగీత ఫణితి

నన్నయాది కవీంద్ర సంపన్నమైన
తెలుగు సోమయాజుల వెల్గు మొలకలొప్ప
కవిత వర్షింపు మమ్మ నా కవన రాజ్ఞి
నవ్యభవ్య భరతవాణి నలువరాణి 154





హ్రీం స్ఫారత్రిపుటీ కుటీ కులనటీ హిందోళ హీరప్రభా
సంస్ఫోట స్ఫుట బిందునాద సకలాక్ష స్వీకృతాత్మా కృతీ!
హం స్ఫీతాంతర సాకృతీ రసకృతీ! ఆనంద సారస్వతీ!
సంస్ఫూర్తి స్పృహణీయ ధారణ విలాసంబిమ్మ సాధారణీ! 155

శ్రీనాథాది కవీంద్రసాంద్ర సువచః స్ఫీతాత్మ చక్రాంతర
శ్రీనాదమ్మో! రసార్ద్రయోగి హృదయశ్రీ పద్మినీ భ్రామరీ
ధ్యానమ్మో! రమణీయ రాగరస సంధానమ్ము గావించు వి
జ్ఞానమ్మో! నినదింపుమమ్మ యెదలోనన్ వాణి వీణాధ్వనీ! 156

ఓంకార శ్రుతి పంజరాంతరశుకీ! యోగీంద్రరాణ్మానసీ
హ్రీంకార స్ఫుట నాదబిందు కలహంసీ! ఆగమారామజ
శ్రీంకారోజ్జ్వల పింఛ లాంఛిత మయూరీ! భావనానంత ధీ
పంకేజాత సహస్ర సంచరదళీ! భద్రమ్ము లీయంగదే! 157

నీ పాదాబ్జ మరంద బిందువులలో నీ నేత్ర పద్మమ్ములన్
ప్రాపై తోచిన శ్రీకలారుచులలోనన్ వక్త్రలక్ష్మీవిలా
సాపాంగ భ్రమరీ విలాసములలో నానంద నిష్యంద బిం
దూ పాథోధి తరంగి తంబగునటుల్ తోచున్ సుధావర్షిణీ! 158

అమ్మా! యమ్మ! మదీయ జీవిత రథంబానంద మార్గమ్మునం
గొమ్మా! శిక్ష నొసంగి భార్గవ కళా గోపాయిత శ్రీకటా
క్షమ్ముల్ చిమ్మి రసప్రపంచమున సాక్షాత్కార మిప్పింపవే
ధమ్మిల్లీకృత సర్వదిగ్వలయ! ప్రోద్యద్భాను కోటిప్రభా! 159

## శ్రీం
## లఘు వివవరణ

| పుట | పద్యము | పదము | వివరణ |
|---|---|---|---|
| 1. | 1 | కామరాజాగమబీజయుక్తి | శ్రీ విద్యా బీజాక్షరములతో కూడి. |
| 1. | 3 | ఐణవిషాణమౌని | లేడికొమ్ము తలదాల్చి పుట్టిన మౌని – ఋష్య శృంగమహర్షి |
| 1. | 3 | నీ యునికి పట్టుల | అక్షరములే తన ఆకృతియైన శారద మనలో మూలాధారమునుండి ఆజ్ఞా చక్రము వరకు గల ఆరు పద్మాలలో 'అ' నుండి 'హ' వరకు భావించదగియున్నది. ఆమె యునికి పట్టులు అవ్వి. అచ్చులు 16 ప్రాణములు – హల్లులు 34 ప్రాణులు ఇవి అన్నీ మన ఉచ్ఛ్వాస నిశ్వాసములచే నియమితములై యున్నవి. |
| 1. | 4 | విపంచీతత | వీణా వాద్యము |
| 2. | 1 | సర్వవాఙ్మయ విశారద | వాక్కు పరాపశ్యన్తీ, మధ్యమా, వైఖరీ రూపముల నాలుగు దశలు కలది. అట్టి సర్వ వాఙ్మయమున విశదయైయున్నది. |
| 2. | 5 | మల్లికాప్రసూబంభర | మల్లికార్జునుడు / భ్రమరాంబ బిందుస్థానీయులు |
| 4. | 13 | శ్రీపురము | బైందవ స్థానము – నవమా వరణము |
| | | భూపురము | భూపుర త్రయము ప్రథమా వరణము త్రైలోక్య మోహనము. |





| | | | |
|---|---|---|---|
| 6. | 21 | హిమరుక్ | చంద్రుడు |
| 6. | 24 | మీనాంకుని | మన్మథుని |
| 7. | 27 | గుణముల్ | ఆకాశమునకు శబ్దముగుణము<br>వాయువునకు – స్పర్శ<br>తేజస్సునకు – రూపము<br>జలమునకు – రసము<br>పృథ్వికి – గంధము గుణములు. |

తల్లికి ఆయుధములు వేతే ఏమీలేవు –
మన రాగమే – తన చేతి పాశము –
మన క్రోధమే – తన చేతి అంకుశము –
మనము కోరు శబ్దస్పర్శాదులే – ఆమె చేతిలో బాణములు
మనమనస్సే – ఆమె చేతిలో తీయని విల్లు – శరాసనము – విల్లు.

రావణునికి సీతపై రాగము, రామునిపై కోపము, వాడు కోరిన శబ్ద స్పర్శ రూప రస గంధములే వానిపై కురిసిన బాణములు – మనలోనే ఉన్నతల్లి మన లక్షణములను బట్టియే మనకు రక్షణగాని శిక్షగాని విధిస్తూ వుంటుంది – రావణుడే అందుకు ఉదాహరణము. శ్రీరాముడు మరో రీతిగా ఉదాహరణము – రామునకు సీతపై రాగమే రావణుని పాలిటి పాశము – రావణుని పై రాముని కోపమే సీత చేతిలోని అంకుశము. రామునకు ఏవి గుణములో సీతకూ అవే గుణములు. రాముని మనస్సే సీత చేతిలోని ధనుస్సు – సీత మనస్సే రాముని చేతిలోని ధనుస్సు. ఆ ధనుస్సు ప్రయోజనము శిష్ట రక్షణము దుష్ట (రావణ) శిక్షణము.

| | | | |
|---|---|---|---|
| 7. | 30 | ద్యావా | ఆకాశము<br>ద్యోమార్గధునీ – ఆకాశగంగ |
| 8. | 31 | మహౌషధము | ''హరనేత్రాగ్ని సందగ్ధకామ సంజీవనౌషధిః'' అని అమ్మకు పేరు – దగ్ధమై పోయిన వానినే బ్రతికించు ఔషధము – అంత కంటె మహౌషధము – మరేముండును! |

8. 33 అద్వైతామృతానంద లక్ష్మీధీనైచికి అద్వైత రూపమైన అమృతానంద లక్ష్మిని గూర్చిన బుద్ధిని ప్రసాదించు మంచి ధేనువు -

వాచం ధేను ముపా సీత - అని శ్రుతి ప్రమాణము - అట్టి వాగ్ధేనువు చేతనే 'ధీ' బుద్ధి - ఆ బుద్ధిచే కలుగు ఆనందలక్ష్మియే అద్వైతామృతము -

ఈ సమాసము కవి కల్పించినది కాదు. పద్య రచనా ధోరణిలో సమకూడినది - అప్రయత్నసిద్ధము - అర్థము చేసికొనగా కవికి అద్వైతామృతానంద లక్ష్మిని గూర్చిన బుద్ధిని ప్రకాశింప జేసిన వాగ్ధేనువే వాగర్థ రూపిణియైన తల్లియన్న బోధకలిగినది.

8. 35 పద్యము అచ్చులు పదునారున్నూ స్వరములు - స్వయం ప్రకాశమానములు దైవములు - తమంతట తాము ప్రకాశించునవి - ఇతరములైన హల్లులను ప్రకాశింప జేయునవి - హల్లులు - ఋషులు, గుణింతములు - ఋషిగణములు. సంయుక్తాక్షరములు - విభిన్న ఋషి కూటములు సర్వ దేవ ఋషి వర్గములే ఈ అక్షర రూపములు వీని "హృత్పద్మము" అక్షర పద్మము - అందు ఆసీనయై యున్న దివ్యవాణి గీర్వాణి.

"దేవర్షి గణ సంఘాత స్తూయమా నాత్మ వైభవ" అని లలితా సహస్రనామ స్తోత్రములో అమ్మవారి నామము. దానికి భాస్కరార్యులవారి వ్యాఖ్యానము ఆధారముగా ఈ భావన.

వాక్కును ప్రసన్నముగా భావించిన అది దివ్యముగా కామధేనువుగా 'కల్యాణీ వాక్కు' అగును. "ఉన్మత్త దృప్తానాం వాచం రాక్షసీమాహుః" అని భవభూతి ఉత్తర రామ





చరితలో నన్నది స్మరింప దగును ప్రయోక్తను బట్టి వాక్కు యొక్క లక్షణముండును.

9. 40 సానందియై రసగ్గ్హ్యేవలబ్ధ్వాஉ నందీ భవతి - అని ఉపనిషత్తు - జలకమ్ములాడు చెలువు - రసవంతమైనది - దానిచే స్వామి సానంది యైనాడని.

13. 60 స్వప్నజ్మార్భుడ నిద్రాళువును

"స్వప్నక్ శయాళుర్ని ద్రాళుః" అమరము. నిద్రపోతును

చూ. అ. కో. గు. బా.

స్వపితి తాచీల్యేనేతి స్వప్నక్. జ. ఞిష్వప్‌శయే - శీఙ్ స్వప్నే - శిప్నుత్వంబు - తిరస్కారముతో.

15. 66 భవాని - తిజన్తము క్రియా పదముగా అర్థము - అగుదును గాక ! అని.

సుబన్తము - నామవాచకముగా - తల్లీ ! భవాని అని సంబోధన.

"భవాని" అన్న మాట విన్న మాత్రముననే ఆ భక్తునకు తల్లి తన సాయుజ్యము నిచ్చును. అంతటి పుత్రవత్సల ఆమె పిలిచినదె తడవుగా కోరిన దానికంటె అధికముగా నిచ్చునది అని భావము. శంకర భగవత్పాదులు సౌందర్య లహరిలో "భవానిత్వం దాసేమయి" అను శ్లోకమున చమత్కారముగా "భవాని" పదమును ప్రయోగించిరి.

21. 98 సామీచీన్యము యోగ్యము

24. 111 "కల్యాణి దృష్టి" విస్మితవము (అచ్చెరువు) తో కూడిన దృష్టి - అయోధ్యా దృష్టి (కంటిలో నల్ల గ్రుడ్లు) కనీనికలయందు హాసము యొక్క మొలకలు కలది.

భోగవతీ - దృష్టి - స్నిగ్ధమైనది -
మెఱుగు చూపులతో నిద్ధమైనది.
తళుకు చూపులు.

అవంతీ దృష్టి - ముగ్ధమైనది.
అనగా యౌవన ప్రారంభదశాకన్యా
దృశ్యమానమైనముగ్ధమోహనదృష్టి
-

మిథిలలో శివధనుర్భంగము చేసిన రాముని జూచిన సీత మొదటి చూపు అచ్చెరువుతో కూడినది - అదియే కల్యాణీ దృష్టి, ఆమె ఆచూపు చూచి అయోధ్యా ప్రభువైన రాముని చూపులో నవ్వు మొలకలు వెలువడినవి - అది అయోధ్యా దృష్టి - సీత చూపు భోగవతీ దృష్టియైనది - అవంతీ దృష్టియైనది. రాముని జూచి ప్రేమతిియైన ఆమె చూపులు జగత్కల్యాణ ప్రదములవు గాక!

| | | |
|---|---|---|
| 26. 122 | 3వ పాదం చివర<br>4వ పాదం మొదలి | ఆత్మలుం కువలుగ<br>ఆత్మలు - శరీరములు ఉంకువలు<br>- సమర్పణము చేసికొని - |
| 28. 132 | కామకలా<br>కామకలా విలాసము | శ్రీవిద్య<br>పేరుతో నున్న శ్రీ విద్యారహస్య గ్రంథము |
| 30 142 | భామిని<br>ఆర్గురు సంతతి | తల్లి<br>కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు |
| 34. 153 | జంబేటి జంబాలి<br>2వ పాదం<br>కృప + ఆలోక<br>కృపాపాంగ గరిమ<br>కృప + అపాంగ | బంగారు బురద<br>కృపాలోక గరిమ -<br>దయతో చూచిన చూపులు<br>దయతోడి<br>కడ కంటి చూపు. |





## గ్రంథకర్త ఇతర కృతులు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ వేంకటేశ్వర స్తుతి | (పద్య సంపుటి) | 1956 |
| 2. | మహార్ణవమి | (సంగీత రూపకము)<br>AIR ప్రసారము | 1966 |
| 3. | మధురా విజయము | (చారిత్రక నవల)<br>ఆంధ్రా యూనివర్శిటీ ప్రచురణ | 1969 |
| 4. | శింశుపా | (సాంఘిక నవల)<br>ఆంధ్రప్రభ సన్‌డే సీరియల్ | 1972 |
| 5. | అభిషేకము | (భాసనాటక ఆంధ్రీకృతి) | 1976 |
| 6. | కృష్ణా తరంగిణి | (సంగీత రూపకము) కృష్ణాజిల్లా రచయితల సంఘ ప్రచురణము | |
| 7. | కాదంబరీ రసజ్ఞత | (బాణకాదంబరికి వ్యాఖ్య) | 1978 |
| 8. | కళ్యాణ రాఘవము | (సంగీత రూపకము)<br>ప్రసారము) | 1983 |
| 9. | కళ్యాణ శాకుంతలము | (సంగీత రూపకము)<br>డి.డి. ప్రసారము | 1990<br>1994 |
| 10. | సుందర కల్పవృక్షము | (కవిప్రభా ప్రచురణము) | 1990 |
| 11. | మానసహిమాంశు | (ముద్రణలో) | |
| 12. | ఇయం స్వతంత్ర భారతీ | (ముద్రణలో) | |
| 13. | "నను పాలింప...." | (అముద్రితము) | |
| 14. | Joy Divine | | 1996 |

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्
दक्षिणाम्नाय श्री शारदापीठम्, शृंगेरी


Saradamba


Sri Sri Bharathi Theertha Mahaswamigal

"తమరు ఈ గ్రంథమునందు అత్యంత భక్తితో ఆ పరమేశ్వరిని స్తుతించినారు. తమ రచన భావపూర్ణముగ నున్నది. పద్యము లందు మాధుర్యము తొణికిసలాడుచున్నది. దానిని పఠించువారలకు ఆ దేవి యందు భక్తిని ఇనుమడింపజేయునదిగ నున్నది.

ఈ గ్రంథము భక్తజనుల కరపల్లవాలంకార మగుగాక యనియు తమ కితోధిక శ్రేయః పరంపరలు సమకూరుగాక యనియు శ్రీ చరణులు నారాయణ స్మరణ పూర్వకముగా నాశీర్వదించినారు"

— - *Private Secretary to His Holiness*

SARADANANDA LAHARI - *Devotional Poetry*
By PERALA BHARATA SARMA

Publishers :
**KADAMBARI** - 26/8, M.V.P. Colony, Visakhapatnam - 530 017.

Printed at **SPAA** 547600 Price **Rs. 50/-**